# వేదాంతసారము

డా॥ ఎ. రాములు

ప్రచురణ :
శ్రీ వేదభారతి
హెచ్ 34, మధురానగర్, హైదరాబాద్.,
ఫోన్: 3736282

# వేదాంతసారము

డా॥ ఎ. రాములు

అసిస్టెంట్ ప్రొఫెసర్ సంస్కృత విభాగము

ఉస్మానియా విశ్వవిద్యాలయము హైదరాబాదు

ప్రచురణ :

శ్రీ వేదభారతి

2002

# వేదాంతసారము



కాపీలు 1000

ప్రథమ ముద్రణ 2002

వెల : 25-00

ప్రచురణ :

శ్రీ వేదభారతి

ఫోన్: 3816163

హైదరాబాదు




ముద్రణ :

దీప్తి టెక్నికలర్ ప్రింటర్స్(హైటెక్)

ఫోన్ : 7671357

హైదరాబాద్

# విషయ సూచిక

పేజీ నెం

# వేదాంతసారః

## మంగళాచరణము

1 **అఖణ్డం సచ్చిదానన్దమవాఙ్మానసగోచరమ్**
**ఆత్మానమఖిలాధారమాశ్రయేऽభీష్టసిద్ధయే 1**

మాటలకు, మనస్సునకు అందనివాడు, సంపూర్ణ జగత్తునకు ఆధారుడు, అఖండ సచ్చిదానంద స్వరూపుడునైన పరమాత్మను నాకోరిక నెరవేరుటకు (మోక్ష ప్రాప్తికై) ఆశ్రయించెదను

## గురువందనము

2. **అర్థతోऽప్యద్వయానన్దానతీతద్వైతభానతః**
**గురూనారాధ్య వేదాన్తసారం వక్ష్యే యథామతి 2**

జీవాత్మ వేరు, పరమాత్మ వేరు అను ద్వైతబావము లేకుండా, ఎల్లప్పుడు జీవబ్రహ్మైక్యరూపమైన అద్వైతములోనే (తన్మయుడై) ఆనందమునను బవించుచు అద్వయానందులని సార్థకనామధేయులైన గురువులను పూజించి, నా జ్ఞానము ననుసరించి వేదాంతసారాంశమును (ఉపనిషద్వాక్యములలోని సిద్ధాంత రహస్యము లను) వేదాంతసారమను గ్రందరూపములో తెలియజేసెదను

## వేదాంతనామవిచారణ

3. **వేదాన్తో నామోపనిషత్ప్రమాణం తదుపకారీణి శారీరకసూత్రాదీని చ**

స్వతః ప్రమాణమైనది వేదము దానియొక్క చివరి భాగమున ఉన్నవి ఉపనిషత్తులు (మొదటి భాగమున ఉన్నవిమంత్రములు బ్రాహ్మణములు, ఆరణ్యకములు) వేదములో చివరిబాగమైన ఉపనిషత్తులను ఆదారముగా చేసికొని ఆధ్యాత్మికజ్ఞానమును బోధించునది వేదాంతము బ్రహ్మసూత్రములు (బగవద్గీత) మొదలగునవి వేదాంత జ్ఞానప్రాప్తికి ఉపకరించును

## అనుబంధ చతుష్టయము

4 **అస్య వేదాన్తప్రకరణత్వాత్ తదీయైః ఏవ అనుబన్ధైః తద్వత్తాసిద్ధేః, న**

**తే పృథగాలోచనీయాః**

ఈగ్రంధము వేదాంతశాస్త్రాంతర్గతమైనందున, వేదాంతశాస్త్రములోని ఇతర గ్రంథములను చదువుటవలన కలుగు ప్రయోజనము, దీనిని చదువుట వలనను సిద్ధించును వేదాంతశాస్త్రములోని ఇతరగ్రంథము లకు చెప్పబడిన అనుబంధ చతుష్టయమే దీనికి కూడా ఉపకరించును కావున మరల దీనిలో వేరుగా చెప్ప నవసరము లేదు

**5. తత్ర అనుబన్ధో నామ అదికారివిషయసమ్బన్ధప్రయోజనాని**

అదికారి విషయము, సంబందము, ప్రయోజనము అనునవి నాలుగు అనుబంద చతుష్టయము

**అధికారి**

**6. అదికారీ తు విదివదదీతవేదవేదాఙ్గత్వేనాపాతతోఽదిగతాఖిలవేదార్థోఽస్మిన్ జన్మని జన్మాన్తరే వా కామ్యనిషిద్ధవర్జనపురఃసరం నిత్యనైమిత్తిక ప్రాయశ్చిత్తోపాసనాను- ష్ఠానేన నిర్గతనిఖిలకల్మషతయా నితాన్తనిర్మల స్వాన్తః సాధనచతుష్టయసమ్పన్నః ప్రమాతా**

'స్వాద్యాయోఽద్యేతవ్యః (స్వపితృపితామహ పరంపరాప్రాప్తమైన వేదశాఖను చదువవలెను' అను విదివాక్యము ననుసరించి (ఋుక్, యజుస్, సామ, అదర్వణ) ఒకవేదశాఖను శిక్ష కల్పము, వ్యాకరణము, నిరుక్తము, చందస్సు, జ్యోతిషము అను ఆరు వేదాంగములను చదివి, వేదార్థమును తెలిసికొన్నవాడు, ఈ జన్మలోను గతజన్మలలోను కామ్య, నిషిద్ధ కర్మలను వదలిపెట్టి నిత్య, నైమిత్తిక, ప్రాయశ్చిత్త, ఉపాసనాదులను మాత్రము అనుష్ఠించుటచే పాపములన్ని నశించగా, నిర్మలమైన అంతః కరణము కలవాడగుటచే సాదన చతుష్టయసంపద కలిగినవాడే " ఆత్మతత్వాన్ని తెలిసికొనుటకు వేదాంతశాస్త్రమునందు అదికారి

**నిత్యకామ్యాది కర్మలు**

**7. కామ్యాని - స్వర్గాదీష్టసాధనాని జ్యోతిష్టోమాదీని ।**

కామ్యములు - కోరిక ఫలించుటకై అనుష్ఠించు కర్మలు ఉదా - స్వర్గాదిసుఖప్రాప్తికై చేయు అగ్నిష్ఠోమాదియాగములు

**8. నిషిద్ధాని - నరకాద్యనిష్టసాదనాని బ్రాహ్మణహననాదీని**

నిషిద్ధములు :- శ్రుతి, స్మృతులచే నిషేధించబడినవి నరకాది దుఃఖప్రాప్తికి కారణములు

**9. నిత్యాని - అకరణే ప్రత్యవాయసాధనాని సన్ధ్యావన్దనాదీని**

నిత్యములు :- ఫలమును ఆశించకుండా, విధ్యుక్తధర్మముగా అనుష్ఠించు కర్మలు వీటిని అనుష్ఠించకపోవుటచే ప్రత్యవాయము (పాపము) కలుగును అనగా చేయకున్నచో పాపము వచ్చును ఉదా - సంధ్యావందనాదులు

**10. నైమిత్తికాని - పుత్రజన్మాద్యనుబన్ధీని జాతేష్ట్యాదీని**

నైమిత్తికములు :- ఒక నిమిత్తమును అనుసరించి విదించబడిన కర్మలు పుత్రోత్పత్తి, గ్రహణము మొదలగు నిమిత్తములననుసరించి, ఆచరించు జాతేష్టి గ్రహణస్నానాదులు

**11. ప్రాయశ్చిత్తాని - పాపక్షయసాదనాని చాన్ద్రాయణాదీని**

ప్రాయశ్చిత్తములు :- తెలిసియో తెల్యియకయో చేసినతప్పులను సరిదిద్దు కొనుటకై అనుష్ఠించుకర్మలు తప్పులవలన సంబవించు పాపములు వీని ఆచరణము వలన నశించును ఉదా - చాంద్రాయణాది వ్రతములు

**12. ఉపాసనాని - సగుణబ్రహ్మవిషయమానసవ్యాపారరూపాణి శాణ్డిల్యవిద్యాదీని**

ఉపాసనలు :- సగుణబ్రహ్మవిషయములై, మనస్సును ఒక ఉద్దేశ్యమున ఉంచుటకు సహకరించు శాండిల్య విద్య (చాం ఉ 3-14-1) మొదలగునవి

**13. ఏతేషాం నిత్యాదీనాం బుద్ధిశుద్ధిః పరం ప్రయోజనముపాసనానాం తు**

**చిత్తైకాగ్ర్యమ్ । తమేతమాత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన , ఇత్యాది శ్రుతేః తపసా కల్మషం హన్తి ఇత్యాది స్మృతేశ్చ ।**

నిత్య, నైమిత్తిక, ప్రాయశ్చిత్తముల అనుష్ఠానముచే ప్రధానముగా అంతః కరణము నిర్మలమగును. ఉపాసన చిత్తైకాగ్ర్యాన్ని కలగించునని శ్రుతి :- బ్రాహ్మణులు వేదములను చదువుట, యజ్ఞాలను అనుష్ఠించుట, తపస్సుచేయుట, (చాంద్రాయణాది) ఉపవాసములు చేయుట - వీటిచేత పరమాత్మను తెలుసుకోగోరు చున్నారు", (బృ.ఉ 4-4-22) తపస్సు పాపములను నశింపజేయును అని స్మృతి. (మను.12-104).

**14. నిత్యనైమిత్తికప్రాయశ్చిత్తోపాసనానాం త్వవాన్తరఫలం పితృలోక సత్యలోకప్రాప్తిః కర్మణా పితృలోకో విద్యయా దేవలోక ఇత్యాది శ్రుతేః ॥**

నిత్య, నైమిత్తిక, ప్రాయశ్చిత్త, ఉపాసనల ద్వారా లబించు పితృలోక, సత్యలోక ప్రాప్తి మొదలగునవి ప్రాసంగిక ఫలములని శ్రుతిః - కర్మలచే పితృలోకము, విద్యచే దేవలోకము .(బృ.ఉ. 1-5-16).

**సాదనచతుష్టయము**

**15. సాధనాని -**

**నిత్యానిత్యవస్తువివేకేహాముత్రార్థఫలభోగవిరాగశమాదిషట్కసమ్ప్రత్తిముముక్షుత్వాని ।**

1. నిత్య, అనిత్య వస్తువుల విచారణ. 2. ఇహపరలోకములలో సుఖముల ననుభవించవలెననెడు కోరిక లేకపోవుట. 3. శమము మొదలగు ఆరు గుణములు కలిగియుండుట. 4. మోక్షముపొందవలెనను కోరిక, ఈనాలుగు సాధన చతుష్టయమని చెప్పబడును.

**16. నిత్యానిత్యవస్తువివేకస్తావద్బ్రహ్మైవ నిత్యం వస్తు । తతోఽన్యదఖిల మనిత్యమితి వివేచనమ్ ॥**

నిత్యానిత్యవస్తువివేకము :- బ్రహ్మమొక్కటె నిత్యము, బ్రహ్మము కంటె ఇతరములైన సమస్తవస్తువులు అనిత్యములనుజ్ఞానము.

**17. ఐహికానాం స్రక్చన్దనవనితాదివిషయబోగానాం కర్మజన్యతయాऽని త్యత్వ వదాముష్మికాణామప్యమృతాదివిషయభోగానామనిత్యతయా తేభ్యో నితరాం విరతిః ఇహాముత్రార్థఫలభోగవిరాగః**

ఇహాముత్రార్థపలభోగవిరాగము :- తానాచరించిన పుణ్యకర్మల ఫలితముగా ప్రాప్తించు ఐహికములైన స్రక్చన్దనాది భోగములు (పూలమాలను దరించుట, చందనమును అలదుకొనుట) నిత్యములు కానట్లే పార లౌకికములైన (స్వర్గలోక) అమృత పానాది భోగములుకూడ నిత్యములుకావు ఈ ఐహిక పారలౌకిక భోగములందు ఆసక్తి లేకుండుట.

**18. శమాదయస్తు - శమదమోపరతితితిక్షాసమాధానశ్రద్ధాఖ్యాః ॥**

శమాదిషట్కము :- శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము, శ్రద్ధ అనునవి.

**19. శమస్తావత్ - శ్రవణాదివ్యతిరిక్తవిషయేభ్యో మనసో నిగ్రహః ।**

శమము :- బగవద్విషయకములైన శ్రవణ, మనన, నిధిధ్యాసనముల కంటె భిన్నములైన ప్రాపంచిక విషయములనుండి మనస్సును మరల్చుట.

**20. దమః - బాహ్యేన్ద్రియాణాం తద్వ్యతిరిక్తవిషయేభ్యో నివర్తనమ్ ।**

దమము :- బగవద్విషయకములైన శ్రవణాదులకంటె వ్యతిరిక్తములైన ప్రాపంచిక విషయములనుండి త్వక్, చక్షుస్, శ్రోత్ర, జిహ్వా,ఘ్రాణేంద్రియములను మరల్చుట.

**21. నివర్తితానామేతేషాం తద్వ్యతిరిక్తవిషయేభ్య ఉపరమణముపరతిః అథవావిహితానాం కర్మణాం విధినా పరిత్యాగః ॥**

ఉపరతి :- భగవద్వ్యతిరిక్త విషయములనుండి మరల్చిన ఇంద్రియములను, మరల ప్రాపంచిక విషయములవైపు మరల కుండా చేయుట లేదా విధ్యుక్త నిత్య, నైమిత్తికాదికర్మలను కూడా విధిపూర్వకముగా వదలిపెట్టుట.

**22. తితిక్షా - శీతోష్ణాదిద్వన్ద్వసహిష్ణుతా ।**

తితిక్ష ః- శీతోష్ణ, సుఖదుఃఖ, మానావమానాది ద్వంద్వములను సహించుట.

**23. నిగృహీతస్య మనసః శ్రవణాదౌ తదనుగుణవిషయే చ సమాధిః సమాదానమ్**

సమాదానము ః- ప్రాపంచిక విషయములనుండి మరల్చిన మనస్సును భగవద్విషయక శ్రవణాదులందు, శ్రవణాదులకు ఉపకారక ములైన గర్వరాహిత్యాది గుణములయందు నిరంతరము ఉంచుట.

**24. గుర్వూపదిష్టవేదాన్తవాక్యేషు విశ్వాసః - శ్రద్ధా**

శ్రద్ధ ః- గురువు బోధించిన ఉపదేశములందు, ఉపనిషదాది వేదాంత శాస్త్ర విషయములందు విశ్వాసము.

**25. ముముక్షుత్వం - మోక్షేచ్ఛా ॥**

ముముక్షుత్వము ః- మోక్షము పొందాలన్న తపన

**26. ఏవమ్భూతః ప్రమాతాధికారీ శాన్తో దాన్త ఇత్యాది శ్రుతేః ఉక్తఞ్చ ప్రశాన్తచిత్తాయ జితేన్ద్రియాయ ప్రహీణదోషాయ యథోక్తకారిణే ।గుణా న్వితాయానుగతాయ సర్వదా ప్రదేయమేతత్ సతతం ముముక్షవే ఇతి**

సాధనచతుష్టయ సంపన్నుడు వేదాంతశాస్త్రమునందు అధికారి అని శ్రుతి ః- శాంతుడు, దాంతుడు.. (బృహ.ఉ 4-4-23) 'ప్రశాంతమైన హృదయము గలవాడు జితేంద్రియుడు, భ్రమప్రమాదాది దోషరహితుడు, గురువు ఆజ్ఞను శిరసా వహించు వాడు, సద్గుణవంతుడు, ఎల్లవేళల గురువును అనుసరించువాడు, మోక్షమునకై తపించువాడును అగు శిష్యునకు అధ్యాత్మవిద్య ప్రసాదించవలెను' (ఉపదేశసాహస్రి.324-16-72) అనియు చెప్పబడినది.

**విషయము**

**27. విషయః - జీవబ్రహ్మైక్యం శుద్ధచైతన్యం ప్రమేయం తత్ర ఏవ**

సమర్పించుటకై తీసుకొని, వెళ్ళి, అతనిని సేవించవలెననిశ్రుతి - 'ఆత్మ తత్త్వమును తెలుసుకొనుటకు, సమిధలను తీసు కొన్నవాడై, శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడయిన సద్గురువునాశ్రయించ వలెను' (ముండ.ఉ 1-2-12).

**31. స గురుః పరమకృపయా అధ్యారోపాపవాద న్యాయేనైనముపదిశతి తస్మై స విద్వానుపసన్నాయ ప్రాహ ఇత్యాది శ్రుతేః**

దయకలిగిన ఆగురువు అధ్యారోప - అపవాదన్యాయముతో ఆత్మ జ్ఞానమును బోధించునని శ్రుతి - 'బ్రహ్మవేత్త అయిన గురువు శిష్యునకు నిత్యసత్య పరమాత్మను బ్రహ్మజ్ఞానము ద్వారా బోధించును'. (ముండ. ఉ. 1-2-13)

**అద్యారోపము**

**32. అసర్పభూతాయాం రజ్జౌ సర్పారోపవద్ వస్తున్యవస్త్వారోపోఽధ్యారోపః**

అధ్యారోపన్యాయమునకు లౌకికోదాహరణమును చూపించుచున్నాడు :- తాడెప్పుడును పాము కాజాలదు, కాని భ్రమలో తాడును చూచి పామనుకొంటారు. వస్తువులో అవస్తువు (తనముందున్న వస్తువు కంటె భిన్న మైనదాని) బావమును పొందుటయే భ్రమ. ఈ అజ్ఞానమే అద్యారోపము

**33.వస్తు సచ్చిదానన్దానన్తాద్వయం బ్రహ్మ । అజ్ఞానాదిసకలజడ సమూహోఽవస్తు ।**

సచ్చిదానందము, అనంతము, అఖండమును అయిన బ్రహ్మమే వస్తువు. అజ్ఞానాది సమస్త జడపదార్ధముల సమూహము అవస్తువు.

**34. అజ్ఞానం తు సదసద్భ్యామనిర్వచనీయం త్రిగుణాత్మకం జ్ఞానవిరోధి భావరూపం యత్కిఞ్చిదితి వదన్త్యహమజ్ఞ ఇత్యాద్యనుభవాత్ దేవాత్మ శక్తిం స్వగుణైర్నిగూఢామ్ ఇత్యాది శ్రుతేశ్చ**

ఈ అజ్ఞానము - సత్తు (ఉన్నటువంటిది) అసత్తు (లేనిది) అని

నిర్వచించడానికి వీలు కానిది. సత్వ, రజస్, తమస్ అను త్రిగుణాత్మకము, జ్ఞానమునకు ప్రతిబంధకమైనది. భావరూపమైన ఏదో ఒక పదార్థమువలె భాసిల్లునది. స్వానుభవము, శ్రుతి అజ్ఞానమున్నదనుటలో ప్రమాణములు ఉదాహరణకు నేను అజ్ఞానిని, నేను నిన్ను తెలుసుకొనను ఇత్యాది స్వానుభవములు అజ్ఞాన స్వరూపములే. "దీప్తి మంతమయిన ఆత్మశక్తి తన సత్త్వాది గుణములద్వారా కప్పబడినదై, కనిపించకుండా ఉంటుంది." అనిశ్రుతి (శ్వేత. ఉ. 1-3)

**అజ్ఞానము, సమష్టి,వ్యష్టి రూపములు**

**35.ఇదమజ్ఞానం సమష్టివ్యష్ట్యభిప్రాయేణైకమనేకమితి చ వ్యవహ్రియతే ।**

ఈ అజ్ఞానము సమష్టిరూపముగా ఒకటనియు, వ్యష్టిరూపముగా అనేకమనియు వ్యవహరింపబడును

**36. తథాహి యథా వృక్షాణాం సమష్ట్యభిప్రాయేణ వనమిత్యేకత్వ వ్యపదేశో యథా వా జలానాం సమష్ట్యభిప్రాయేణ జలాశయ ఇతి తథా నానాత్వేన ప్రతిభాసమానానాం జీవగతాజ్ఞానానాం సమష్ట్యభిప్రాయేణ తదేకత్వవ్యపదేశః అజామేకామ్ ఇత్యాదిశ్రుతేః ।**

వృక్షముల సమూహము సమష్టిరూపముగా వనమనియు, జలముల రాశి సమష్టిరూపముగా జలాశయమనియు వ్యవహరింపబడును. అట్లే అనేకములుగా భాసిల్లు జీవుల అజ్ఞాన సమూహము సమష్టిరూపముగా (ఒకే) అజ్ఞానమని చెప్పబడుచున్నదనిశ్రుతిః - "ఒకే అజ్ఞానము జన్మ రహితము, త్రిగుణాత్మకము." (శ్వేత. ఉ. 4-5).

**37. ఇయం సమష్టిరుత్కృష్టోపాధితయా విశుద్ధసత్త్వప్రధానా ।**

ఈ సమష్టిరూపమయిన అజ్ఞానము ఉత్కృష్టమయిన ఉపాధితో కూడుకొన్నది కావున శుద్ధ సత్వగుణప్రధానమయినది .

**38. ఏతదుపహితం చైతన్యం సర్వజ్ఞత్వసర్వేశ్వరత్వసర్వనియన్తృత్వాది గుణకమవ్యక్తమన్తర్యామీ జగత్కారణమీశ్వర ఇతి చ వ్యపదిశ్యతే**

**సకలాజ్ఞానావభాసకత్వాత్ యః సర్వజ్ఞః స సర్వవిత్ ఇతి శ్రుతేః ।**

ఈ సమష్టి అజ్ఞానముచే కూడుకొనిన చైతన్యస్వరూపమయిన బ్రహ్మమే సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, సర్వనియంత, అవ్యక్తుడు (వ్యక్తముకానివాడు) అంతర్యామి (అంతటావ్యాపించి ఉన్నవాడు) జగత్కారణుడు, ఈశ్వరుడు అని వ్యవహరింపబడును. సంపూర్ణ అజ్ఞానము భాసించుటకు ఇతడే కారణము కావున సర్వజ్ఞుడని శ్రుతి : 'జగత్తును ఎవడు సామాన్యవిశేష రూపముల ద్వారా తెలుసుకొనునో, అతడే సర్వజ్ఞుడు'.(ముండ. ఉ. 1-1-9)

**ఈశ్వరుడు (కారణ శరీరము)**

**39. ఈశ్వరస్యేయం సమష్టిరఖిలకారణత్వాత్ కారణశరీరమానన్ద ప్రచురత్వాత్కోశవదాచ్ఛాదకత్వాచ్చానన్దమయకోశః సర్వోపరమత్వాత్ సుషుప్తిరత ఏవ స్థూలసూక్ష్మ ప్రపఞ్చలయస్థానమితి చోచ్యతే ।**

ఈశ్వరునకు ఉపాధిస్వరూపమైన ఈసమష్టిరూప అజ్ఞానము సమస్త బ్రహ్మాండ- మునకు కారణము కావున కారణశరీరమని చెప్పబడును. ఆనందము అధికముగా ఉండుటచే, కోశము (సంచి) వలె ఆత్మను కప్పుట చేతను ఆనందమయ కోశము. సమస్త ఇంద్రియములకు విశ్రాంతి స్థానమగుటచే సుషుప్తి. కావుననే స్థూలసూక్ష్మ ప్రపంచ లయస్థానమని వ్యవహరింపబడును.

**40. యథా వనస్య వ్యష్ట్యభిప్రాయేణ వృక్షా ఇత్యనేకత్వవ్యపదేశో యథా వా జలాశయస్య వ్యష్ట్యభిప్రాయేణ జలానీతి, తథాఽజ్ఞానస్య వ్యష్ట్యభిప్రాయేణ తదనేకత్వవ్యపదేశః ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే ఇత్యాదిశ్రుతేః ॥**

వనము నందలి వృక్షములను వేరువేరుగా గ్రహించినచో అనేక వృక్షములుగా వ్యవహరింపబడును. జలాశయమునందలి జలములు వ్యష్టిభావముతో అనేక జలములని వ్యవహరింపబడును. అట్లే జీవ రూప

అజ్ఞానము వ్యష్టిరూపముగా అనేక అజ్ఞానములుగా వ్యవహరింపబడునని శ్రుతి :- 'ఈశ్వరుడు అనేక విధము లైన మాయలద్వారా అనేక రూపములను ధరించును' (ఋగ్వేద 6-47-18)

**41. అత్ర వ్యస్తసమస్తవ్యాపిత్వేన వ్యష్టిసమష్టితావ్యపదేశః**

ప్రత్యేక జీవాత్మయందు ఈశ్వరుడు వ్యాపించి ఉండుటచే వ్యష్టిరూపమని సమస్త జీవవ్యాపి అగుటచే సమష్టిరూపమని తెలిసికొన వలయును.

**ప్రాజ్ఞుడు (జీవుడు)**

**42. ఇయం వ్యష్టిర్నికృష్టోపాధితయా మలినసత్త్వప్రధానా ।**

అజ్ఞాన వ్యష్టిరూపము నీచమైన ఉపాధి కలిగి ఉన్నందువలన తమోగుణ మిశ్రితమైన (మలినమైన) సత్త్వగుణము ప్రధానముగా కలిగి యున్నది .

**43. ఏతదుపహితం చైతన్యమల్పజ్ఞత్వానీశ్వరత్వాదిగుణయుక్తః ప్రాజ్ఞ ఇత్యుచ్యతే, ఏకాజ్ఞానావభాసకత్వాత్ ॥**

అజ్ఞాన వ్యష్టిరూపముచే ఆవరించబడిన చైతన్యము అల్పజ్ఞుడు, అనీశ్వరుడు, వేరు వేరుగా ఒక్కొక్క అజ్ఞానమును మాత్రమే ప్రకాశింప చేయగలడు కావుననే ప్రాజ్ఞుడు అని చెప్పబడును.

**44. అస్య ప్రాజ్ఞత్వమస్పష్టోపాధితయానతిప్రకాశకత్వాత్ ।**

రజస్, తమోగుణములచే సత్వగుణము పరాభూతముకాగా ప్రాజ్ఞునికి ఉపాధి అయిన అజ్ఞాన వ్యష్టి, ధూళిధూసరితమైన అద్దమువలె అస్పష్టమగును. ఉపాధి మలినమైనందున చిదాత్మను, చక్కగా ప్రకాశింప చేయలేదు కావున ప్రాజ్ఞుడని వ్యవహారము.

**45. అస్యాపీయమహఙ్కారాదికారణత్వాత్ కారణశరీరమానన్ద ప్రచురత్వాత్కోశవదా- చ్ఛాదకత్వాచ్చానన్దమయకోశః సర్వోపరమత్వాత్సుషుప్తిరత ఏవ స్థూలసూక్ష్మ శరీరప్రపఞ్చలయస్థానమితి చోచ్యతే ।**

అజ్ఞాన వ్యష్టిరూపము అహంకారాదులకు కారణము కావున కారణ శరీరము. అధికముగా ఆనందము కలిగి కోశము (సంచి) వలె ఆత్మను కప్పుచున్నది కావున ఆనంద మయ కోశము. ఇంద్రియములకు విశ్రాంతిస్థాన మగుటచే సుషుప్తి అందువలననే స్థూల, సూక్ష్మ ప్రపంచలయ స్థానమ నియు చెప్పబడును.

**ఈశ్వరప్రాజ్ఞుల స్వాత్మానందానుబవము**

**46. తదానీమేతావీశ్వరప్రాజ్ఞౌ చైతన్యప్రదీప్తాభిరతిసూక్ష్మాభిరజ్ఞానవృత్తిభిరానన్దమనుభవతః ఆనన్దభుక్చేతోముఖః ప్రాజ్ఞః ఇతి శ్రుతేః సుఖమహమస్వాప్సం న కిఞ్చిదవేదిషమి త్యుత్థితస్య పరామర్శోపపత్తేశ్చ ।**

అప్పుడు (ప్రళయము లేదా సుషుప్తియందు) ఈశ్వరుడు ప్రాజ్ఞుడు వీరిద్దరు చైతన్యముచే ప్రకాశించబడిన అతిసూక్ష్మములైన అజ్ఞాన వృత్తులద్వారా ఆనందమును అనుభవించుదురని శ్రుతి :- 'ప్రాజ్ఞుడు (జీవుడు) చైతన్య ప్రకాశముచే సుఖమును అనుభవించును' (మాండూ. ఉ 5)సుఖముగా నిదురించినాను, నాకేమితెలియలేదు అని నిద్రనుండి మేల్కొన్న వ్యక్తి పరామర్శించుకొనుచున్నాడుకూడా.

**ఈశ్వరప్రాజ్ఞుల అబేదము**

**47. అనయోః సమష్టివ్యష్ట్యోర్వనవృక్షయోరివ జలాశయజలయోరివ వాభేదః ॥**

వృక్షముల సమష్టిరూపమైన వనమునకు, వనవ్యష్టిరూపములైన వృక్షములకు భేదములేదు. జలముల సమష్టిరూపమైన జలాశయమునకు, జలాశయ వ్యష్టి రూపములైన జలములకు బేదములేదు. అట్లే అజ్ఞాన సమష్టి, వ్యష్టిరూపములకు ఎలాంటి భేదమునులేదు.

**48. ఏతదుపహితయోరీశ్వరప్రాజ్ఞయోరపి వనవృక్షావచ్ఛిన్నాకాశయోరివ జలాశయ జలగతప్రతిబిమ్బాకాశయోరివ వాభేదః ఏష సర్వేశ్వర ఇత్యాదిశ్రుతేః ।**

వనములో ఉన్న ఆకాశమునకు - వృక్షములలో ఉన్న ఆకాశమునకు భేదము లేదు. జలాశయములో ప్రతిబింబించిన ఆకాశమునకు - జలములలో ప్రతిబింబించిన ఆకాశమునకు భేదము లేదు. అట్లే అజ్ఞాన (సమష్టిరూప) ముతో కూడుకొనిన ఈశ్వరునకు అజ్ఞాన (వ్యష్టిరూప) ముతో కప్పబడిన ప్రాజ్ఞునకు ఎట్టిభేదము లేదని శ్రుతి :- ఈతడే సర్వేశ్వరుడు, ఈతడే అంతర్యామి, ఈతడే సర్వకారణుడు, ఈతడే జగత్సృష్టిస్థితిలయకారకుడు'.(మాండు. ఉ. 6)

**తురీయ(నాలుగవ)చైతన్యము**

**49. వనవృక్షతదవచ్ఛిన్నాకాశయోర్జలాశయజలతద్గతప్రతిబిమ్బాకాశయోర్వాఽఽధారభూతానుపహితాకాశవదనయోరజ్ఞానతదుపహితచైతన్యయోరాధారభూతం యదనుపహిత చైతన్యం తత్తురీయమిత్యుచ్యతే శివమద్వైతం చతుర్థం మన్యన్తే ఇత్యాది శ్రుతేః ॥**

వనములో ఉన్న ఆకాశమునకును - వృక్షములలో ఉన్న ఆకాశమునకును ఆధారమైనది, ఉపాధులు (పరిమితులు)లేని మహాకాశమున్నది. జలాశయములో ప్రతిబింబించిన ఆకాశమునకు - జలములలో ప్రతిబింబించిన ఆకాశమునకు ఆధారమైనది, అపరిమితమైనది అగు మహాకాశమున్నది. అట్లే సమష్టిరూప మున ఉన్న అజ్ఞానమునకు - వ్యష్టి రూపములైన అజ్ఞానములకు, ఈ ఉపాధులచే కూడుకొనిన రెండు చైతన్యములకు (ఈశ్వరప్రాజ్ఞులకు)ఆధారమైనది, నిరుపాధికమైనది (అపరిమితమైనది) అగుశుద్ధచైతన్యమున్నదని, అదే నాలుగవదని చెప్ప బడునని శ్రుతి :- మంగళమయమైన అద్వితీయ చైతన్యమే నాలుగవదని చెప్పబడును, అదే ఆత్మ. అదే విజ్ఞేయము' (మాండు .ఉ. 7)

**50. 'ఇదమేవ తురీయం శుద్ధచైతన్యమజ్ఞానాదితదుపహితచైతన్యాభ్యాం తప్తాయఃపిణ్డవదవివిక్తం సన్మహావాక్యస్య వాచ్యం వివిక్తం సల్లక్ష్యమితి చోచ్యతే ॥**

అగ్నిచే కాల్చబడిన ఇనుము ఎఱ్ఱనిదై, అగ్నిచే అబిన్నమై ఇనుము కాల్చును ఇత్యాది వాక్య ప్రయోగాలను పొందును. ఈవాక్యములో అగ్ని ఇనుముతో అభిన్నమై ఇనుము అనుపదమునకు వాచ్యార్థమును, ఇనుముతో భిన్నరూపమై లక్ష్యార్థమగును. అట్లే ఈ నాలుగవ బ్రహ్మ చైతన్యమే, సమష్టి అజ్ఞానముతో కూడుకొనిన చైతన్యముతో (జీవునితో) అబిన్నమై తత్త్వమసి (ఛాం. ఉ. 6-8-7) అను మహావాక్యమునకు వాచ్యార్థమును, బిన్నమై లక్ష్యార్థమును అగును.

**అజ్ఞాన శక్తిద్వయము, ఆవరణశక్తి**

**51. అజ్ఞానస్యావరణవిక్షేపనామకమస్తి శక్తిద్వయమ్ ॥**

అజ్ఞానమునకు 1. ఆవరణశక్తి 2. విక్షేపశక్తి అని రెండుశక్తులున్నవి.

**52. అవరణశక్తిస్తావదల్పోఽపి మేఘోఽనేకయోజనాయతమాదిత్యమణ్డల మవలోక- యితృనయనపథపదాయకతయా యథాచ్ఛాదయతీవ తథాఽజ్ఞానంపరిచ్ఛిన్నమప్యాత్మానమపరిచ్ఛిన్నమసంసారిణమవలోకయి తృబుద్ధిపిధాయకతయాచ్ఛాదయతీవ తాదృశం సామర్థ్యమ్ । తదుక్తమ్ -**

**ఘనచ్ఛన్నదృష్టిర్ఘనచ్ఛన్నమర్కం యథా మన్యతే నిష్ప్రభం చాతి మూఢః । తథా బద్ధవద్భాతి యో మూఢదృష్టేః స నిత్యోపలబ్ధి స్వరూపోఽహమాత్మా ఇతి ॥**

చిన్నదైన మేఘము, చూచేవాని కళ్ళను ఆవరించి, అనేక యోజనముల విస్తీర్ణమైన సూర్యమండలమును కనిపించకుండ చేయుచు ఆవరించినట్లు ఉండును. అట్లే అజ్ఞానము పరిమితమైనదైనను, వివేక హీనుడైన మానవుని బుద్ధిని ఆవరించి, సర్వవ్యాపి అసంసారియైన పరబ్రహ్మమును కనిపించకుండచేయుచు ఆవరించినటుల ఉండును. ఈవిషయమును హస్తామలకాచార్యులు "మూఢుడు తన కళ్ళను మేఘమావరించగ, సూర్యమండలమునే మేఘము ఆవరించినట్లు, కాంతివిహీన మైనట్లుగా అనుకొనును. అట్లే మూఢుని అజ్ఞాన

మావరించగా, బ్రహ్మమునే సంసారబద్ధునిగా అనుకొనును. కాని నిజమునకు నిత్యసత్య జ్ఞానస్వరూపమైన ఆత్మనే నేను' (హస్తామలకం 10) అని చెప్పెను.

**53. అనయైవావరణశక్త్యావచ్ఛిన్నస్యాత్మనః కర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖ మోహాత్మకతుచ్ఛసంసారభావనాపి సమ్భావ్యతే యథా స్వాజ్ఞానా వృతాయాం రజ్జ్వాం సర్పత్వసమ్భావనా ।**

తనను అజ్ఞానము ఆవరించగా, తాడును చూసిపామనుకొను భ్రమలో తాడనుజ్ఞానముపోయి, పామనుజ్ఞానము కల్గును. అట్లే అజ్ఞాన ఆవరణశక్తి ఆత్మను ఆవరించగా, తన నిజస్వరూప జ్ఞానమును పొందక నేనుకర్తను నేనుభోక్తను, నేనుసుఖవంతుడను, నేను దుఃఖవంతుడను 'అను కర్తృత్వ భోక్తృత్వ, సుఖదుఃఖ మోహజాలముతో నిండిన సంసారభావన కలుగును

**విక్షేపశక్తి**

**54. విక్షేపశక్తిస్తు యథా రజ్జ్వజ్ఞానం స్వావృతరజ్జౌ స్వశక్త్యా సర్పాదిక ముద్భావయత్యేవమజ్ఞానమపి స్వావృతాత్మని విక్షేపశక్త్యాకాశాది ప్రపఞ్చాదికముద్భావయతి తాదృశం సామర్థ్యం । తదుక్తమ్ ...**

**విక్షేపశక్తిర్లిఙ్గాదిబ్రహ్మాణ్డాన్తం జగత్సృజేదితి ॥**

తాడని తెలియని అజ్ఞానము, తాడును ఆవరించినదై, తనశక్తితో తాడులో పామును చూపును. అట్లే విక్షేపశక్తి, అజ్ఞాన మావరించిన ఆత్మలో ఆకాశాది పంచ భూతములను చూపును. ఈవిషయమే (వాక్యసుధా 13) అజ్ఞాన విక్షేపశక్తి, కారణ శరీరము మొదలుకొని బ్రహ్మాండ పర్యంతము జగత్తునంత సృజించును అని చెప్పబడినది.

**చైతన్యసంసార కారణత్వము**

**55. శక్తిద్వయవదజ్ఞానోపహితం చైతన్యం స్వప్రధానతయా నిమిత్తం స్వోపాధి ప్రధాన తయోపాదానం చ భవతి ॥**

ఆవరణము, విక్షేపము అను రెండుశక్తులు కలిగిన అజ్ఞానముచే

కూడిన చైతన్యము జగత్తునంత సృష్టించుచు తాను కర్త (ప్రధానము) కావున నిమిత్తకారణము, తనకు ఉపాధి అయిన అజ్ఞానము (కుండకు మట్టిలాగా), సంసారమునకు (ఆధారము) కావున ఉపాదాన కారణము కూడ అగుచున్నది.

**56. యథా లూతా తన్తుకార్యం ప్రతి స్వప్రధానతయా నిమిత్తం స్వశరీరప్రధానతయోపాదానం చ భవతి**

సాలెపురుగు దారములతో గూడును అల్లుచు నిమిత్తకారణము అగును, ఆ దారములను తనశరీరము నుండి తీయుచు, (శరీరమును ప్రధానముగా తీసి కొన్నప్పుడు) అది ఉపాదాన కారణమును అగును

**సృష్టిక్రమము**

**57.తమః ప్రధానవిక్షేపశక్తిమదజ్ఞానోపహితచైతన్యాదాకాశః ఆకాశాద్వాయుర్వాయోరగ్నిరగ్నేరాపోఽద్భ్యః పృథివీ చోత్పద్యతే తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సమ్భూత ఇత్యాదిశ్రుతేః**

తమోగుణ ప్రధానమైన విక్షేపశక్తితో కూడిన అజ్ఞానము చైతన్యము నావరించగా, ఆచైతన్యము నుండి ఆకాశము పుట్టును. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి నీటి, నీరునుండి భూమి పుట్టునని శ్రుతిః - 'ఆ ఆత్మనుండి ఆకాశము పుట్టినది..' (తై . ఉ 2-1-1)

**58. తేషు జాడ్యాధిక్యదర్శనాత్తమః ప్రాధాన్యం తత్కారణస్య తదానీం సత్త్వరజస్తమాంసి కారణగుణప్రక్రమేణ తేష్వాకాశాదిషూత్పద్యన్తే ।**

ఉత్పన్నములైన ఆకాశాదులలో జడత్వము అధికముగా కనిపించు చున్నందున, దానికి కారణము తమోగుణ ప్రాధాన్యమని తెలియుచున్నది ఆకాశాదులు పుట్టిన తరువాత, తమతమ కారణగుణముల ఆధారముగా ఆకాశాదులనుండి సత్త్వ, రజస్, తమోగుణములు పుట్టును.

**59. ఏతాన్యేవ సూక్ష్మభూతాని తన్మాత్రాణ్యపఞ్చీకృతాని చోచ్యన్తే ।**

ఈ ఆకాశాది పంచభూతములే సూక్ష్మభూతములు,

పంచతన్మాత్రలు, అపంచీకృతములని చెప్పబడును.

60. **ఏతేభ్యః సూక్ష్మశరీరాణి స్థూలభూతాని చోత్పద్యన్తే**

ఈ అపంచీకృతములైన ఆకాశాది పంచభూతములనుండే సూక్ష్మశరీరములు, స్థూలభూతములును పుట్టును

61. **సూక్ష్మశరీరాణి సప్తదశావయవాని లిఙ్గశరీరాణి ॥**

సూక్ష్మశరీరములు :- పదిహేడు అవయవములు. ఇవే లింగశరీరములు.

62. **అవయవాస్తు జ్ఞానేన్ద్రియపఞ్చకం, బుద్ధిమనసీ, కర్మేన్ద్రియపఞ్చకం, వాయుపఞ్చకఞ్చేతి ॥**

అవయవములు :- ఐదు జ్ఞానేంద్రియములు, బుద్ధిమనస్సులు, ఐదు కర్మేంద్రియములు, ఐదు వాయువులు.

63. **జ్ఞానేన్ద్రియాణి శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాఖ్యాని ।**

జ్ఞానేంద్రియములు :- శ్రోత్రము (చెవి), త్వక్కు (చర్మము), చక్షుస్ (కన్ను), జిహ్వా (నాలుక), ఘ్రాణములు (చెవి).

64. **ఏతాన్యాకాశాదీనాం సాత్త్వికాంశేభ్యో వ్యస్తేభ్యః పృథక్ క్రమేణోత్పద్యన్తే ॥**

ఈ ఐదుజ్ఞానేంద్రియములు ఆకాశాది సాత్వికాంశముల నుండి వేరువేరుగా క్రమముగా పుట్టును

65. **బుద్ధిర్నామ నిశ్చయాత్మికాన్తఃకరణవృత్తిః ।**

బుద్ధి :- నిశ్చయమును కలిగించు అంతఃకరణవృత్తి.

66. **మనో నామ సఙ్కల్పవికల్పాత్మికాన్తః కరణవృత్తిః ॥**

మనస్సు :- సంకల్పమును వికల్పమును కలిగించు అంతఃకరణవృత్తి.

67. **అనయోరేవ చిత్తాహంకారయోరన్తర్భావః ॥**

ఈ బుద్ధిమనస్సులలోనే చిత్తాహంకారములు అంతర్భవించును.

68. **అనుసన్ధానాత్మికాన్తః కరణవృత్తిః చిత్తమ్ ।**

చిత్తము :- విమర్శనాత్మకమైన అంతఃకరణవృత్తి

69. అభిమానాత్మికాన్తఃకరణవృత్తిః అహంకారః

అహంకారము :- అభిమానముతోకూడిన అంతఃకరణవృత్తి.

70. ఏతే పునరాకాశాదిగతసాత్త్వికాంశేభ్యో మిలితేభ్య ఉత్పద్యన్తే ।

ఇవి సమ్మిళితములైన ఆకాశాది పంచభూతముల సాత్వికాంశముల నుండి పుట్టును.

71. ఏతేషాం ప్రకాశాత్మకత్వాత్సాత్త్వికాంశకార్యత్వమ్ ॥

ఇవి స్వయంప్రకాశకములు కావున పంచభూత సాత్వికాంశ జన్యములని చెప్పబడినవి.

72. ఇయం బుద్ధిర్జ్ఞానేన్ద్రియైః సహితా విజ్ఞానమయకోశో భవతి ।

ఈ బుద్ధే ఐదుజ్ఞానేంద్రియములతో కలిసి విజ్ఞానమయకోశమని చెప్పబడును

73. అయం కర్తృత్వభోక్తృత్వసుఖిత్వదుఃఖిత్వాద్యభిమానత్వేనేహ లోకపరలోక గామీ వ్యావహారికో జీవ ఇత్యుచ్యతే ।

ఈ విజ్ఞానమయకోశమే కర్తృత్వ, భోక్తృత్వ, సుఖిత్వ, దుఃఖిత్వాది అభిమానములతో ఉన్నదై, ఈలోకము పరలోకము వెళ్ళును. కావున జీవుడని చెప్పబడును.

74. మనస్తు జ్ఞానేన్ద్రియైః సహితం సన్మనోమయకోశో భవతి ॥

మనస్సు జ్ఞానేంద్రియములతో కూడుకొన్నదై మనోమయ కోశమనబడును

75. కర్మేన్ద్రియాణి వాక్పాణిపాదపాయూపస్థాఖ్యాని ।

కర్మేంద్రియములు :- వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు.

76. ఏతాని పునరాకాశాదీనాం రజోంశేభ్యో వ్యస్తేభ్యః పృథక్-పృథక్ క్రమేణోత్పద్యన్తే ॥

ఈ వాగాది కర్మేంద్రియములు సమ్మిళితములుకాని ఆకాశాదుల నుండి వేరువేరుగా క్రమముగా పుట్టును.

కూర్మము ః- కళ్ళను మూసివేయునది.

కృకలము ః- ఆకలిని కలిగించునది.

దేవదత్తము ః- ఆవులింతను కలిగించునది.

ధనంజయము ః- పుష్టిని కలిగించునది.

**86. ఏతేషాం ప్రాణాదిష్వన్తర్భావాత్ప్రాణాదయః పఞ్చైవేతి కేచిత్**

ఈ నాగాదివాయువులు ప్రాణాది వాయువులలోనే అంతర్భవించునని వేదాంతులు.

**87. ఏతత్ప్రాణాదిపఞ్చకమాకాశాదిగతరజోంశేభ్యో మిలితేభ్యః ఉత్పద్యన్తే ॥**

ఈ ప్రాణాది పంచవాయువులు పంచభూతముల మిళితములైన రాజసాంశముల నుండి వేరు వేరుగా క్రమముగా జన్మించును.

**88. ఇదం ప్రాణాదిపఞ్చకం కర్మేన్ద్రియైః సహితం సత్ప్రాణమయకోశో భవతి । అస్య క్రియాత్మకత్వేన రజోంశకార్యత్వమ్**

ఈ ప్రాణాది పంచవాయువులు పంచకర్మేంద్రియములతో కలసి ప్రాణమయకో- శమనబడును గమనాగమనాదిక్రియలు పంచ వాయువుల, పంచకర్మేంద్రియముల స్వబావము కావున ఈ వాయువులు, ఈ కర్మేంద్రియములు పంచభూతముల రాజసాంశములనుండి జన్మించును.

**89. ఏతేషు కోశేషు మధ్యే విజ్ఞానమయో జ్ఞానశక్తిమాన్ కర్తృరూపః మనోమయ ఇచ్ఛాశక్తిమాన్ కరణరూపః । ప్రాణమయః క్రియాశక్తిమాన్ కార్యరూపః । యోగ్యత్వాదేవమేతేషాం విభాగ ఇతి వర్ణయన్తి । ఏతత్కోశ త్రయం మిలితం సత్సూక్ష్మశరీరమిత్యుచ్యతే**

ఈ మూడుకోశములలో విజ్ఞానమయకోశము జ్ఞానశక్తింసంపన్నమై కర్తృ రూపమైనది. మనోమయకోశము ఇచ్ఛాశక్తితో కూడుకొన్నదై కరణరూపమైనది. ప్రాణమయకోశము క్రియాశక్తితో కూడుకొన్నదై

కార్యరూపమైనది. ఈ విధముగా వీటి యోగ్యతల ననుసరించి ఈమూడు కోశముల విభాగమని చెప్పుదురు. ఈ మూడుకోశములు కలసి సూక్ష్మ శరీరమగును.

**సూక్ష్మప్రపంచనిరూపణము**

**90. అత్రాప్యఖిలసూక్ష్మశరీరమేకబుద్ధివిషయతయా వనవజ్జలాశయ వద్వా సమష్టిరనేకబుద్ధివిషయతయా వృక్షవజ్జలవద్వా వ్యష్టిరపి భవతి ॥**

సకల చరాచరముల సూక్ష్మశరీరములు అన్నియు ఒక్కటే అవి ఏకత్వ బుద్ధికి విషయములైతే వనము, జలాశయమువలె సమష్టి. అనేకములని అనేకబుద్ధి విషయములైతే వృక్షములు, జలములువలె వ్యష్టికూడా అగును.

**91. ఏతత్సమష్ట్యు పహితం చైతన్యం సూత్రాత్మా హిరణ్యగర్భః ప్రాణశ్చేత్యుచ్యతే సర్వత్రానుస్యూతత్వాజ్జ్ఞానేచ్ఛా క్రియాశక్తి మదుప హితత్వాచ్చ।**

ఈ సమష్టి ఉపాధితో కూడుకొనిన చైతన్యము అంతటవ్యాపించి ఉన్నందున (కోశత్రయముకలిగి ఉన్నందున) జ్ఞాన, ఇచ్ఛా, క్రియలు కలిగి ఉన్నందున సూత్రాత్మ, హిరణ్యగర్భుడు ప్రాణము అని చెప్పబడును.

**92. అస్యైషా సమష్టిః స్థూలప్రపఞ్చాపేక్షయా సూక్ష్మత్వాత్ సూక్ష్మశరీరం విజ్ఞానమయాది కోశత్రయం, జాగ్రద్వాసనామయత్వా త్స్వప్నోఽత ఏవ స్థూలప్రపఞ్చ లయస్థానమితి చోచ్యతే ।**

ఈ సూక్ష్మశరీరముల సమష్టి స్థూలప్రపంచమునకంటె చిన్నది అగుటచే సూక్ష్మశరీము, విజ్ఞానమయాది కోశత్రయము, జాగ్రదవస్థలోని వాసనలు కలిగి ఉన్నందున స్వప్నమనియు, స్థూలప్రపంచలయస్థాన మనియు చెప్పబడును.

**93. ఏతద్వ్యష్ట్యు పహితం చైతన్యం తైజసో భవతి తేజోమయాన్తః ... కరణోపహితత్వాత్**



ఈ సూక్ష్మశరీరముల వ్యష్టిరూపమైన ఉపాధితో కూడుకొనిన చైతన్యము తేజోమయ అంతః అకరణము ఉపాధిగా కలిగి ఉన్నందున తైజసమని చెప్పబడును.

**94. అస్యాపీయం వ్యష్టిః స్థూలశరీరాపేక్షయా సూక్ష్మత్వాదితి హేతోరేవ సూక్ష్మ- శరీరం విజ్ఞానమయాదికోశత్రయం జాగ్రద్వాసనా మయత్వాత్స్వప్నోఽత ఏవ స్థూలశరీరలయస్థానమితి చోచ్యతే ।**

తైజసునకు ఉపాధి అయిన వ్యష్టిరూపమైన సూక్ష్మశరీరము, స్థూలశరీరముకంటె చిన్నది కావున సూక్ష్మశరీరము, విజ్ఞానమయాది కోశత్రయము కలిగి ఉన్నదై, విశ్వచైతన్యముతో అనుభవించిన స్థూలశరీర విషయములు వాసన రూపమున ఉన్నందున స్వప్నమని, అందువలననే స్థూల శరీరలయస్థానమనియు చెప్పబడును

**95. ఏతౌ సూత్రాత్మతైజసౌ తదానీం మనోవృత్తిభిః సూక్ష్మవిషయా ననుభవతః ప్రవివిక్తభుక్తైజస ఇత్యాదిశ్రుతేః ।**

అప్పుడు (స్వప్నావస్థలో) ఈ సూత్రాత్మ, తైజసులు మనోవృత్తుల ద్వారా సూక్ష్మవిషయములను అనుభవించెదరని శ్రుతిః - "తైజసుడు సూక్ష్మ (విషయ) భోక్త".(మాండు ఉ. 3).

**96. అత్రాపిసమష్టివ్యష్ట్యోస్తదుపహితసూత్రాత్మతైజసయోర్వనవృక్షవత్త దవచ్ఛిన్నాకాశవచ్చ జలాశయజలవత్తద్గతప్రతిబిమ్బాకాశవచ్చాఽభేదః ।**

వనము - వనములోని వృక్షములు, వనములో ఉన్న ఆకాశము - వనవృక్షము- లలో ఉన్న ఆకాశము బిన్నముకాదు, జలాశయము - జలాశయములోని జలములు, జలాశయములో ప్రతిబింబించిన ఆకాశము జలాశయ జలములలో ప్రతిభింబించిన ఆకాశము భిన్నముకాదు. అట్లే సూక్ష్మశరీరముల సమష్టి - సూక్ష్మశరీరములవ్యష్టి,ఆ సమష్టిచే కూడు కొనిన హిరణ్యగర్భునకు - ఆవ్యష్టిచే కప్పబడిన తైజసునకును ఎలాంటి భేదము లేదు.

97. ఏవం సూక్ష్మశరీరోత్పత్తిః ।

ఈ విధముగా సూక్ష్మశరీరోత్పత్తి (నిరూపించబడినది)

**స్థూలభూతనిరూపణము పంచీకరణము**

98. స్థూలభూతాని తు పఞ్చీకృతాని ।

పంచీకరణముచే మిశ్రితములు, మిళితములైన పంచ భూతములు స్థూలభూతములు

98. పఞ్చీకరణం త్వాకాశాదిపఞ్చస్వేకైకం ద్విధా సమం విభజ్య తేషు దశసు బాగేషుప్రాథమికాన్ పఞ్చభాగాన్ ప్రత్యేకం, చతుర్ధా సమం విభజ్య తేషాం చతుర్ణాం భాగానాం స్వస్వద్వితీయార్ధభాగపరిత్యాగేన భాగాన్తరేషు సంయోజనమ్ ।

ఆకాశాది పంచభూతములలో ఒక్కొక్క భూతమును రెండేసి భాగములు చేయగా 5x2=10 పదిభాగములగును. ఈపదింటిలో ఒక్కొక్క భూతముయొక్క ఒక్కొక్క భాగమును అనగా ఐదుభూతముల ఐదు భాగములను ప్రక్కనపెట్టి, మిగతా ఐదుభాగములలో ఒక్కొక్క దానిని నాలుగేసి భాగములు చేయగా 5x4=20 ఇరువది బాగములగును. ప్రక్కకుపెట్టిన పెద్దనైన ఐదు భాగములలో ఒక్కొక్క దానితో, ఇరువది భాగములలోని ఆపెద్దభాగమునగు సంబంధించిన, చిన్నభాగమును వదలిపెట్టి, మిగతా నాలుగు బూతముల యొక్క భాగములను ఒక్కొక్కటి చొప్పున, నాలుగు చిన్నభాగములను కలుపుట పంచీకరణమగును

పృథ్వీ =1/2పృథ్వీ +1/8 జలము1/8 తేజస్సు1/8 వాయువు1/8ఆకాశము

జలము =1/2 జలము+1/8 తేజస్సు1/8 వాయువు1/8ఆకాశము1/8 పృథ్వీ

తేజస్సు=1/2 తేజస్సు+1/8వాయువు1/8 ఆకాశము1/8 పృథ్వీ1/8 జలము

వాయువు =1/2 వాయువు+1/8ఆకాశము1/8పృథ్వీ1/8జలము1/8తేజస్సు

ఆకాశము=1/2 ఆకాశము+1/8పృథ్వీ1/8జలము1/8తేజస్సు1/8వాయువు.

పంచీకరణమును బోదించు కారిక

100. తదుక్తమ్ ---

ద్విధా విదాయ చైకైకం చతుర్ధా ప్రథమం పునః
స్వస్వేతరద్వితీయాంశైర్యోజనాత్పఞ్చ పఞ్చ తే ఇతి ।

'పంచ భూతములలో ఒక్కొక్క దానిని రెండేసి భాగములు చేసి 5x2=20 మొదటి ఐదుభాగములను మరల నాలుగేసి భాగములు చేసి 5x4=20, పంచభూతముల రెండవ పెద్దభాగములలో, ఒక్కొక్క దానితో (ఆపెద్దబాగమునగు సంబంధించిన భూతము యొక్క చిన్నభాగమును వదిలిపెట్టి మిగతానాలుగు భూతముల) చిన్న బాగములను కలుపుట పంచీకరణమగును'.(పంచదశి)

101. అస్యాప్రామాణ్యం నాశఙ్కనీయం త్రివృత్కరణశ్రుతేః పఞ్చీకరణాస్యాప్యు- పలక్షమత్వాత్ ।

ఈ పంచీకరణ విషయమున ప్రమాణము లేదని శంకించకూడదు ఎందుకనగా? త్రివృత్కరణమును బోధిస్తున్న శ్రుతి, పంచీకరణమునకు ఉపలక్షణమగును.

102. పఞ్చానాం పఞ్చాత్మకత్వేసమానేఽపి తేషు చ వైశేష్యాత్తద్వాదస్తద్వాదః ఇతి న్యాయేనాకాశాదివ్యపదేశః సమ్భవతి

ఈ ఐదు బూతములలో ఐదు బూతముల బాగములున్నప్పటికిని, ప్రతిదానిలో ఆయాభూతముయొక్క అంశ అధికముగా ఉండుట చేత 'ఆదిక్యమునకనుసరించి నామ కరణము అనున్యాయము ( బ్ర.సూ. 2-4-22)ననుసరించి ఆకాశాది వ్యవహారము.

103. తదానీమాకాశే శబ్దోఽభివ్యజ్యతే వాయౌ శబ్దస్పర్శావగ్నౌ శబ్దస్పర్శరూపాణ్యప్సు శబ్దస్పర్శరూపరసాః, పృథివ్యాం శబ్దస్పర్శ రూపరసగన్ధాశ్చ ॥

పంచభూతముల పంచీకరణ సమయమునందే ఆకాశములో శబ్దగుణము, వాయువులో శబ్ద స్పర్శలు, అగ్నిలో శబ్దస్పర్శరూపములు,

జలములో శబ్ద, స్పర్శ, రూప, రసములు, భూమిలో శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ప్రకటములగును.

## స్థూల ప్రపంచోత్పత్తి

**104. ఏతేభ్యః పఞ్చీకృతేభ్యః భూతేభ్యో భూర్భువః స్వర్మహర్జనస్తపః సత్యమిత్యేతన్నామకానాముపర్యుపరి విద్యమానానామతలవితలసుతల రసాతలతలాతలమహాతలపాతాలనామకానామధోఽధోవిద్యమానానాం లోకానాం బ్రహ్మాణ్డస్య తదన్తర్వర్తిచతుర్విధస్థూలశరీరాణాం తదుచితా నామన్నపానాదీనాఞ్చోత్పత్తిర్భవతి ॥**

ఈ పంచీకరణము నొందిన పంచ భూతముల నుండి భూ, భువర్, సువర్, మహర్, జనో, తపో, సత్యములు అను పై ఏడులోకములు అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళములను క్రింది ఏడులోకములు బ్రహ్మాండము, అందులో నివసించు నాలుగువిధములైన స్థూలశరీరములు, ఆశరీరముల పోషణార్థము అన్నపానాదులును జనించును

**105. చతుర్విధశరీరాణి తు జరాయుజాణ్డజోద్భిజ్జస్వేదజాఖ్యాని ॥**

జరాయుజములు, అండజములు, ఉద్భిజ్జములు, స్వేదజములని శరీరములు నాలుగు విధములు.

**106. జరాయుజాని జరాయుభ్యో జాతాని మనుష్యపశ్వాదీని**

జరాయుజములు :- జరాయువు (మాయువు) ను ఆచ్ఛాదనముగా చేసుకొని జన్మించు మనుష్య, పశ్వాదులు.

**107. అణ్డాజన్యణ్డేభ్యో జాతాని పక్షిపన్నగాదీని ।**

అండజములు :- గుడ్డునుండి జన్మించు పక్షులు, పాములు మొదలగునవి.

**108. ఉద్భిజ్జాని భూమిముద్భిద్య జాతాని లతావృక్షాదీని ।**

ఉద్భిజ్జములు :- భూమిని పెకలించుకొని పుట్టు లతావృక్షాదులు.

109 స్వేదజాని స్వేదేభ్యో జాతాని యూకమశకాదీని ।

స్వేదజములు :- చెమట ద్వారా జన్మించు పేలు, దోమలు మొదలగునవి.

స్థూల ప్రపంచ నిరూపణము

110. అత్రాపి చతుర్విధసకలస్థూలశరీరమేకానేకబుద్ధివిషయతయా వనవజ్జలాశయవద్వా సమష్టిఃవృక్షవజ్జలవద్వావ్యష్టిరపి భవతి ॥

ఈ నాలుగు విధములైన స్థూలశరీర సముదాయము ఏకత్వబుద్ధికి విషయమై వనము, జలాశయమువలె సమష్టి, అనేకత్వబుద్ధికి విషయమై వృక్షములు, జలాశయములవలె వ్యష్టియును అగును.

111. ఏతత్సమష్ట్యుపహితం చైతన్యం వైశ్వానరో విరాడిత్యుచ్యతే సర్వనరాభి మానిత్వాద్వివిధం రాజమానత్వాచ్చ ।

స్థూలశరీరముల సమిష్టిచే కూడుకొనిన చైతన్యమే వైశ్వనరుడు, విరాట్టు అని చెప్పబడును సమస్త శరీరములందు నేనను అభిమానమును కలిగి ఉన్నందున వైశ్వానరుడు స్వయం ప్రకాశకుడగుటచే విరాట్టు.

112. అస్యైషా సమష్టిః స్థూలశరీరమన్నవికారత్వాదన్నమయకోశః స్థూల భోగాయతనత్వాచ్చ స్థూలశరీరం జాగ్రదితి చ వ్యపదిశ్యతే ॥

ఈ సమష్టిరూపమైన స్థూలశరీర సముదాయము అన్నము యొక్క వికారజన్యమగుటచే అన్నమయకోశము, స్థూలములైన భోగములకు ఆధారమగుటచే జాగ్రత్తనియు చెప్పబడును.

113. ఏతద్ వ్యష్ట్యు పహితం చైతన్యం విశ్వ ఇత్యుచ్యతే సూక్ష్మశరీరాభిమానమపరిత్యజ్య స్థూలశరీరాదిప్రవిష్టత్వాత్ ॥

సూక్ష్మశరీరములను వదిలిపెట్టకయే స్థూలశరీరములందు ప్రవేశించుటచే స్థూలశరీరముల వ్యష్టిచేకూడుకొనిన చైతన్యము విశ్వఅని చెప్పబడును.

114. అస్యాప్యేషా వ్యష్టిః స్థూలశరీరమన్నమయవికారత్వాదేవ

**హేతోరన్నమయ కోశో జాగ్రదితి చోచ్యతే**

ఈ విశ్వముయొక్క వ్యష్టి స్థూల శరీరము అన్నపానాది వికార జన్యమగుటచే అన్నమయకోశము, జాగ్రత్తనియు చెప్పబడును.

**విశ్వ - వైశ్వానర విషయానుభవ ప్రకారము**

**115.తదానీమేతౌ, విశ్వవైశ్వానరౌ దిగ్వాతార్కవరుణాశ్విభిః క్రమాన్ని యన్త్రి తేన శ్రోత్రాదీన్ద్రియపఞ్చకేనక్రమాచ్ఛబ్దస్పర్శరూపరసగన్ధా నాగ్నీంద్రోపేన్ద్రయమప్రజాపతిభిః క్రమాన్నియన్త్రితేన వాగాదీన్ద్రియ పఞ్చకేనక్రమాద్వచనాదానగమన విసర్గానన్దాంశ్చన్ద్రచతుర్ముఖశఙ్కరా చ్యుతైః క్రమాన్నియన్త్రితేన మనోబుధ్యహఙ్కారచిత్తాఖ్యేనాన్తరిన్ద్రియ చతుష్కేణ క్రమాత్సఙ్కల్పనిశ్చయాహఙ్కార్యచైతాంశ్చ సర్వానేతాన్ స్థూలవిషయాననుభవతో జాగరితస్థానో బహిఃప్రజ్ఞ ఇత్యాదిశ్రుతేః ।**

జాగ్రదవస్థలో ఈవిశ్వ వైశ్వానరులిరువురు దిక్కు, వాయువు, సూర్యుడు, వరుణుడు, అశ్వినీకుమారులచే క్రమముగా నియంత్రింప బడిన శ్రోత్ర, త్వక్, చక్షుష్, జిహ్వా, ఘ్రాణములను ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా క్రమముగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను అనుభవించుదురు, ఈవిదముగానే అగ్ని, ఇంద్ర, విష్ణు, యమ (చతుర్ముఖ), బ్రహ్మలచే క్రమముగా నియంత్రింపబడిన వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలను ఐదు కర్మేంద్రియముల ద్వారా క్రమముగా మాట్లాడుట, తీసికొనుట, నడచుట, వదలుట, ఆనందించుట అనుబవించుదురు.

చంద్ర, చతుర్ముఖబ్రహ్మ, శివ, విష్ణువులచే క్రమముగా నియంత్రింప బడిన మనో, బుద్ధి, అహంకార, చిత్తములను అంతరింద్రియములద్వారా క్రమముగా సంకల్ప, నిశ్చయ, గర్వ, స్మరణములను స్థూలవిషయ ములను అనుభవింతురని శ్రుతి :- 'జాగ్రదవస్థాయుక్తమేన చైతన్యమే బాహ్యావిషయములను తెలిసికొను చున్నది' (మాండు,ఉ. 3).

విశ్వ - వైశ్వానరుల అభేద ప్రతిపాదనము

116. అత్రాప్యనయోః స్థూలవ్యష్టిసమష్ట్యోస్తదుపహితవిశ్వ వైశ్వానర యోశ్చ వనవృక్షవత్తదవచ్ఛిన్నాకాశవచ్చ జలాశయజలవత్తద్గతప్రతిబిమ్బా కాశవచ్చ పూర్వవదభేదః ॥

వన - వృక్షములకు, వనములో ఉన్నఆకాశమునకు - వృక్షములలో ఉన్న ఆకాశమునకు భేదములేదు జలాశయ - జలములకు, జలాశయ ములో ప్రతిబింబించిన ఆకాశమునకు - జలములలో ప్రతిబింబించిన ఆకాశమునకు భేదము లేదు. అట్లే స్థూలశరీరవ్యష్టి - స్థూలశరీర సమష్టులకు, స్థూలశరీరవ్యష్టితో కూడుకొనిన విశ్వునకు, స్థూలశరీర సమష్టితో కూడుకొనిన వైశ్వానరునకును ఎలాంటి భేదము లేదు.

117. ఏవం పఞ్చీకృతపఞ్చభూతేభ్యః స్థూలప్రపఞ్చోత్పత్తిః ।

ఈ విధముగా పంచీకృతములైన పంచభూతములనుండి స్థూలప్రపంచము ఉత్పన్నమగును

మహాప్రపంచము

118. ఏతేషాం స్థూలసూక్ష్మకారణప్రపఞ్చానామపి సమష్టిరేకో మహాన్ ప్రపఞ్చో భవతి । యథా అవాన్తరవనానాం సమష్టిరేకం మహద్వనం భవతి యథావా అవాన్తరజలాశయానాం సమష్టిరేకో మహాన్ జలాశయః ।

వేరువేరు అడవుల సముహముతో ఒక పెద్దఅడవి అగును. వేరువేరు జలాశయముల సముదాయముతో ఒక పెద్ద జలాశయమగును. అట్లే స్థూల, సూక్ష్మ, కారణ ప్రపంచముల సముదాయము (ఉపాధి) ఒక మహాప్రపంచమగును.

119. ఏతదుపహితం వైశ్వానరాదీశ్వరపర్యన్తం చైతన్యమప్యవాన్తర వనావచ్ఛిన్నా- కాశ వదవాన్తరజలాశయగతప్రతిబిమ్బాకాశవచ్చైకమేవ ।

వేరువేరు వనములలో ఉన్న ఆకాశము, వేరువేరు జలాశయములలో ప్రతిబింబించిన ఆకాశము ఒక్కటే అయినట్లుగా సూక్ష్మోపాధితో ఉన్న

హిరణ్యగర్భ - తైజసులు, స్థూలసృష్ఠ ఉపాదితో ఉన్న వైశ్వానర - విశ్వులు వేరువేరుగా ప్రతీతులైనను అందరు కలిగిఉన్న చైతన్యమొక్కటే.

**120. ఆభ్యాం మహాప్రపఞ్చతదుపహితచైతన్యాభ్యాం తప్తాయః పిణ్డవదవివిక్తం సదనుపహితం చైతన్యం సర్వం ఖల్విదం బ్రహ్మ ఇతి వాక్యస్య వాచ్యం భవతి వివిక్తం సల్లక్ష్యమపి భవతి**

ఎర్రగా కాలిన ఇనుముతో ఏకమైన అగ్ని, అయోదహతి, అను వాక్యమునకు వాచ్యార్థము, ఇనుమువేరు, అగ్నివేరు అను భిన్నత్వ జ్ఞానమునొంది, లక్ష్యార్థమగును. అట్లే ఈ మహా ప్రపంచము, మహాప్రపంచముతో కూడుకొన్న చైతన్యము మహాప్రపంచముతో ఏకమై (అభిన్నమై) సర్వం ఖల్విదం బ్రహ్మ (ఛాం.ఉ 3-14-1) అను శ్రుతి వాక్యమునకు వాచ్యార్థము. మహాప్రపంచమువేరు, చైతన్యమువేరు అను భిన్నత్వజ్ఞానమునొంది లక్ష్యార్థమును అగును.

**121. ఏవం వస్తున్యవస్త్వారోపోఽధ్యారోపః సామాన్యేన ప్రదర్శితః ।**

ఈవిధముగా వస్తువునందు ఆవస్తువైనప్రపంచ ఆరోపరూపమైన అధ్యారోపము సామాన్యరీతిగా (సంక్షేపముగా) చూపబడినది.

**పుత్రాదులకు ఆత్మత్వసాదనము**

**122. ఇదానీం ప్రత్యగాత్మనీదమిదమయమయమారోపయతీతి విశేషత ఉచ్యతే**

ఇప్పుడు జీవచైతన్యములో అధ్యారోపము అనగా ఏయే మతస్థులు ఏయే పదార్థములను జీవాత్మలుగా చెప్పుదురో, అది విపులముగా చూపబడుచున్నది.

**123. అతిప్రాకృతస్తు ఆత్మా వై జాయతే పుత్రః ఇత్యాదిశ్రుతేః స్వస్మిన్నివ స్వపుత్రేఽపి ప్రేమదర్శనాత్పుత్రే పుష్టే నష్టే చాహమేవ పుష్టో నష్టశ్చేత్యాద్యనుభ- వాచ్చ పుత్ర ఆత్మేతి వదతి ॥**

అతిసామాన్యజనులు "పుత్రుడే ఆత్మ" అను శ్రుతిననుసరించి, తనపై

తనకు ఎంత ప్రేమ ఉన్నదో, అంతప్రేమ పుత్రునిపై కనిపిస్తున్నందున, పుత్రుని వృద్ధితో తాను వర్ధిల్లునటుల, పుత్రుని నష్టముతో, తనకు నష్టము కలిగి నటుల భావించుచున్నందున పుత్రుడే ఆత్మ అని చెప్పెదురు.

**124. చార్వాకస్తు స వా ఏష పురుషోఽన్నరసమయ ఇత్యాదిశ్రుతేః ప్రదీప్తగృహాత్స్వపుత్రం పరిత్యజ్యాపి స్వస్య నిర్గమదర్శనాత్ స్థూలోఽహం కృశోఽహమిత్యాద్యనుభవాచ్చ స్థూలశరీరమాత్మేతి వదతి ।**

చార్వాకులు "పురుషుడు అన్న పానాదులచేవృద్ధి నొందువాడు" త్రై.ఉ.2-1-1 అను శ్రుతి ననుసరించి, ఇల్లు కాలుచున్నప్పుడు పుత్రుని వదలిపెట్టికూడా, తనను రక్షించుకొనుటకు ప్రయత్నింతురు, మరియు శరీరవృద్ధి క్షీణతలను అనుసరించి నేను వృద్ధినొందుచున్నాను, నేను క్షీణించుచున్నాను. అను అనుభవాలను అనుసరించియు స్థూలశరీరమే ఆత్మఅని అందురు.

**125. అపరశ్చార్వాకః తే హ ప్రాణాః ప్రజాపతిం పితరమేత్య బ్రూయుః ఇత్యాది శ్రుతేరిన్ద్రియాణామభావే శరీరచలనాభావాత్కాణోఽహం బధిరోఽహమిత్యాద్యను భవాచ్చేన్ద్రియాణ్యాత్మేతి వదతి ।**

కొందరు చార్వాకులు ఆప్రాణములు (ఇంద్రియములు) ప్రజాపతిదగ్గరకువెళ్ళి మొరబెట్టుకొన్నవి (ఛాం. ఉ 5 - 1 - 7) అను శ్రుతిననుసరించి ఇంద్రియములు లేనప్పుడు శరీరములో చలనము లేనందువలనను, నేను గుడ్డివాడను, నేనుచెవిటివాడను, అను అనుభవాలను అనుసరించియు ఇంద్రియములే ఆత్మ అని అందురు.

**126. అపరశ్చార్వాకః అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః ఇత్యాది శ్రుతేః ప్రాణాభావే ఇన్ద్రియాదిచలనాయోగాదహమశనాయావానహం పిపాసావాన్ ఇత్యాద్యనుభవాచ్చ ప్రాణ ఆత్మేతి వదతి ।**

ఇంకా కొందరు చార్వాకులు ప్రాణమయమైన అంతరాత్మ శరీరేంద్రియాదులకంటె భిన్నమైనది (త్రై.ఉ. 2.1.1) అను శ్రుతి

ననుసరించి ప్రాణము లేనప్పుడు శరీరములో చలనము లేనందువలన, నేను ఆకలితో బాధపడుతున్నాను, నేనుదప్పికగొని యున్నాను అను అనుభవముల వలనను ప్రాణమేఆత్మ అని అందురు .

**127. అన్యస్తు చార్వాకః 'అన్యోఽన్తర ఆత్మా మనోమయ ఇత్యాది శ్రుతేర్మనసి సుప్తే ప్రాణాదేరభావాదహం సఙ్కల్పవానహం వికల్పవా నిత్యాద్యనుభవాచ్చ మన ఆత్మేతి వదతి ।**

మరికొందరు చార్వాకులు "మనోమయమైన అంతరాత్మ ఇంద్రియ శరీర ప్రాణాదుల కంటె బిన్నము" (తై.ఉ. 2-3-1) అను శ్రుతి ననుసరించి, మనస్సు నిదురించినప్పుడు ప్రాణాదులు లేనందువలనను, నేనిది చేయవలెనను సంకల్పముతోనున్నాను, నేను దీనిని చేయవలెనా? వద్దా అను సందేహముతో నున్నాను, అను అనుభవములననుసరించుయు మనస్సే ఆత్మఅని అందురు.

**128. బౌద్ధస్తు అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః ఇత్యాది శ్రుతేః కర్తురభావే కరణస్య శక్త్యభావాదహం కర్తాహం భోక్తేత్యాద్యనుభవాచ్చ బుద్ధిరాత్మేతి వదతి ।**

బౌద్ధులు విజ్ఞానమయమైనదే (బుద్ధియే) అంతరాత్మ, (తై.ఉ. 2-4-1) అనుశ్రుతిననుసరించియు, కర్త లేనప్పుడు, కరణములు శక్తి హీనముల గుటను బట్టియు, నేను కర్తను, నేనుభోక్తను, ఇత్యాది అనుభవములుండు టచేతను, బుద్ధియే అత్మఅని అందురు.

**129. ప్రాబాకరతార్కికౌ తు అన్యోఽన్తర ఆత్మానన్దమయ ఇత్యాది శ్రుతేర్బుద్ధ్యా దీనామజ్ఞానే లయదర్శనాదహమజ్ఞోఽహమజ్ఞానీత్యాద్య నుభావాచ్చా జ్ఞానమాత్మేతి వదతః ।**

ప్రాభాకార మీమాంసకులు, తార్కికులు "శరీరాదులకంటె భిన్నమైనది, ఆనందమయమైనది అంతరాత్మ" (తై.ఉ. 2-5-1 ) అను శ్రుతిననుసరించి, బుద్ధ్యాదులన్ని అజ్ఞానములోనే లీనమగుటయు చూచి, నేను అజ్ఞానిని,

"అను అనుభవముండుట చేతను అజ్ఞానమే ఆత్మ అని అందురు.

**130. భాట్టస్తు ప్రజ్ఞానఘన ఏవానన్దమయ ఇత్యాదిశ్రుతేః సుషుప్తౌ ప్రకాశాప్రకాశసద్భావాన్మామహం న జానామీత్యాద్యనుభావాచ్చాజ్ఞానోపహితం చైతన్యం ఆత్మేతి వదతి**

భాట్ట మీమాంసకులు ప్రజ్ఞానఘనమైనది, ఆనందమయమైనది ఆత్మ (మాండూ.ఉ. 5 ) అనుశ్రుతిననుసరించి, సుషుప్తియందు అన్ని లీనమైనప్పటికిని ప్రకాశ, అప్రకాశములు ఉన్నందువలనను, నన్నునేను తెలుసుకోలేకపోతున్నాను ఇత్యాది అనుభవములుండుట చేతను అజ్ఞానముచే కప్పబడిన చైతన్యమే ఆత్మ అని అందురు.

**131. అపరో బౌద్ధః అసదేవేదమగ్ర ఆసీత్ ఇత్యాదిశ్రుతేః సుషుప్తౌ సర్వాభావా దహం సుషుప్తౌ నాసమిత్యుత్థితస్య స్వాభావపరామర్శ విషయానుభవాచ్చ శూన్యమాత్మేతి వదతి ।**

శూన్య వాదులైన బౌద్ధులు "మొదట ఈజగత్తు అసద్రూపముగానే ఉండెను" (ఛా.ఉ. 6-2-1) అను శ్రుతిననుసరించి, సుషుప్తిలో ఏమియు ఉండకపోవుటచేతను, గాఢ నిద్రనుండి మేల్కొన్న వ్యక్తికి 'గాఢనిద్రలో నేను లేకుంటిని ? అని అనుభవముండుట చేతను శూన్యమే ఆత్మ అని అందురు.

**పుత్రాదులకు ఆత్మత్వఖండనము**

**132. ఏతేషాం పుత్రాదీనామనాత్మత్వముచ్యతే**

పుత్రుడు మొదలుకొని శూన్యము వరకు చెప్పినవి ఆత్మకాలేవు అని ప్రతిపాదించుచున్నాడు.

**133. ఏతైరతిప్రాకృతాదివాదిభిరుక్తేషు శ్రుతియుక్త్యనుభవాభాసేషు, పూర్వ పూర్వోక్త శ్రుతియుక్త్యనుభవాభాసానాముత్తరోత్తర శ్రుతియుక్త్యనుభవాభాసైరాత్మత్వబాధదర్శనాత్పుత్రాదీనామనాత్మత్వంస్పష్టమేవ ।**

అతిసామాన్యజనులు మొదలుకొని శూన్యవాదబౌద్ధులవరకు వారు

ప్రమాణములుగా చూపించిన శ్రుతి, యుక్తి, అనుభవాభాసములందు, పూర్వపూర్వముగా ప్రదర్శించిన శ్రుతి, యుక్తి, అనుభవాభాసములు ఉత్తరోత్తరముగా ప్రదర్శిచిన శ్రుతి, యుక్తి, అనుభవాభాసములచే ఖండింపబడినందున, పుత్రాదులకు ఆత్మత్వమును సాధించుటలో బాదకములగుటచే పుత్రాదులు ఆత్మలు కావనుట కడు స్పష్టము.

**134. కిఞ్చ ప్రత్యగస్థూలోऽచక్షురప్రాణోऽమనా ఆకర్తా చైతన్యం చిన్మాత్రం సదిత్యాది ప్రబలశ్రుతివిరోదాధస్య పుత్రాదిశూన్యపర్యన్తస్య జడస్య చైతన్యబాస్యత్వేన ఘటాదివదనిత్యత్వాదహం బ్రహ్మేతి విద్వదనుభవ ప్రాబల్యాచ్చ తత్తఛ్ఛ్రుతియుక్త్య- నుభవాభాసానాం బాధితత్వాదపి పుత్రాదిశూన్యపర్యన్తమఖిలమనా త్మైవ ।**

అంతేకాకుండా, పుత్రాది శూన్యపర్యంతములో ఒకదానిని ఆత్మఅని అంగీకరించినచో 'ఆత్మస్థూలమైనదికాదు, ఇంద్రియములుకాదు, ప్రాణముకాదు, మనస్సుకాదు, కర్త కాదు చైతన్యము, చిత్స్వరూపమైనది' (కఠ.ఉ. 4-1) అను శ్రుతితోవిరోదము. పుత్రాది శూన్యపర్యంతములు జడములు, చైతన్యముచే భాసించునవి కావున ఘటాదులవలె అనిత్యములు కావలసి ఉండునని ఆపత్తి మరియు నేను బ్రహ్మమును, అను దృఢమైన విద్వాంసుల అనుభవముచేతను పుత్రాదిశూన్యపర్యంతములు ఆత్మ కాజాలవు.

**135. అతస్తత్తద్భాసకం నిత్యశుద్ధబుద్ధముక్తసత్యస్వభావం ప్రత్యక్చైతన్య మేవాత్మ- వస్తు ఇతి వేదాన్తవిద్వదనుభవః**

కావున ఆయావస్తువుల ప్రకాశింపచేయునది, నిత్యము, శుద్ధము, సర్వజ్ఞము, బంధనరహితము, సత్యస్వరూపమునైన ప్రత్యక్చైతన్యమే ఆత్మఅని వేదాంతవేత్తల అనుబవము.

**136. ఏవమధ్యారోపః ॥**

ఈవిధముగా వస్తువునందు అవస్తువును ఆరోపంచుస్వరూపమైన

అధ్యారోపము నిరూపించబడెను.

**అపవాదము**

**137. అపవాదో నామ రజ్జువివర్తస్య సర్పస్య రజ్జుమాత్రత్వవద్వస్తు వివర్తస్యావస్తునోఽజ్ఞానాదేః ప్రపఞ్చస్య వస్తుమాత్రత్వమ్ ॥**

తాడులో పామను భ్రమకలిగి, ఆభ్రమతొలగిన తరువాత, పాము, అను జ్ఞానము నశించి, కేవలము తాడనుజ్ఞానము కలుగును. అట్లే వస్తువైన సచ్చిదానంద బ్రహ్మములో అవస్తువులైన అజ్ఞానాది జడపదార్థముల భ్రమ గలిగి, ఆభ్రమతోలగిపోగా, ఈస్వరూపము జ్ఞాన వివర్తమైనందున అప్పుడుకేవలం బ్రహ్మమను జ్ఞానము కలుగును. ఏద్రైతే స్వరూపము నందు వికారమునొంది కార్యమునుపుట్టించునో అది వికారము, ఉపాదానకారణపరిణామము. ఉదాహరణకు పెరుగు పాలవికారము. పెరుగుకు పాలు ఉపాదానకారణము. ఆ పాలపరిణామమే (మార్పె) పెరుగగును.

**138. తదుక్తమ్--------**

**సతత్వతోఽన్యథా ప్రథా వికార ఇత్యుదీరితః**

**అతత్త్వతోఽన్యథా ప్రథా వివర్త ఇత్యుదీరితః ॥ ఇతి**

వస్తువు తనస్వరూపమును వదిలి, ఇంకొకదానిరూపమును గ్రహించినచో అదిపరిణామము, వికారము, ఉదా - పాలుపెరుగుగా మారుట. వస్తువు తననిజస్వరూపమును వదలకుండ ఇంకొక వస్తువు యొక్క మిథ్యాజ్ఞానమును కలిగించినచో అదివివర్తము. ఉదా - తాడు, తన.స్వరూపమునువదలకనే, పామను మిథ్యనుకలిగించును.

**139. తథాహి ఏతద్భోగాయతనం చతుర్విధసకలస్థూలశరీరజాతమ్. ఏతద్ భోగ్యరూపాన్నపానాదికమేతదాయతనభూతభూరాదిచతుర్దశభువనాన్యేత దాయతనభూతం బ్రహ్మాణ్డం చైతత్సర్వమేతేషాం కారణరూపం**

**పఞ్చీకృతభూతమాత్రం భవతి**



భ్రమతొలగిన తరువాత సమస్తజగత్తు తన కారణములో లీనమై బ్రహ్మరూపమునొందునని వివరించుచున్నాడు :-

భోగముల ననుభవించుటకై ఆధారములైన నాలుగు విధములైన (జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జ) స్థూలశరీరములు, భోగ్యపదార్థ ములైన అన్నపానాదులు, వీటికి ఆధారములైన పదునాలుగులోకములు, ఈలోకములకు ఆధారమైన బ్రహ్మాండము - ఇవన్నియు తమకు కారణ ములైన పంచీకరణమునొందిన మహాభూతములలో విలీనములగును.

**140. ఏతాని శబ్దాదివిషయసహితాని పఞ్చీకృతాని భూతాని సూక్ష్మ శరీర జాతం చైతత్సర్వమేతేషాం కారణరూపాపఞ్చీకృతభూతమాత్రం భవతి**

శబ్దాదివిషయములతో కూడుకొనిన ఈపంచీకరణమునొందిన పంచ భూతములు, సూక్ష్మశరీర సముదాయము, ఇవన్నియు, కారణములైన పంచీకరణమునొందని పంచభూతములలో కలియును.

**141. ఏతాని సత్త్వాదిగుణసహితాన్యపఞ్చీకృతాన్యుత్పత్తివ్యుత్క్రమేణ తత్కారణభూతాజ్ఞానోపహితచైతన్యమాత్రం భవతి ॥**

సత్త్వాదిగుణయుక్తములైన, పంచీకరణమునొందని, పంచభూతములు ఉత్పత్తిక్రమమునకు విపరీతముగా అనగా - భూమి జలములో, జలము అగ్నిలో, అగ్ని వాయువులో, వాయువు ఆకాశములో ఈవిధముగా ఆకాశము తనకు కారణమైన అజ్ఞానఉపాధిచే కప్పబడిన చైతన్యము నందు కలియును.

**142. ఏతదజ్ఞానమజ్ఞానోపహితం చైతన్యఞ్చేశ్వరాదికమేతదాధారభూతా నుపహితచైతన్యరూపం తురీయం బ్రహ్మమాత్రం భవతి ॥**

అజ్ఞాన ఉపాధిచే కప్పబడిన చైతన్యము, ఈశ్వరాదులు తమ పుట్టుకకు ఆశ్రయమైన ఉపాధిరహితమైన శుద్ధచైతన్యము, తురీయము నైన (నాలుగవది) బ్రహ్మములో కలియును.

**తత్, త్వం పదార్థశోదనము.**

**143. ఆభ్యామధ్యారోపావాదాభ్యాం తత్త్వమ్పదార్థశోధనమపి సిద్ధం భవతి ॥**

పైన పేర్కొనిన అధ్యారోప, అపవాదములచే, తత్త్వమసి, అనువాక్యములోని తత్ త్వమ్ అను పదముల తాత్పర్యార్థమును స్పష్టపరచుచున్నాడు.

**144. తథాహి । అజ్ఞానాదిసమష్టిరేతదుపహితం సర్వజ్ఞత్వాదివిశిష్టం చైతన్యమేత- దనుపహితం చైతత్త్రయం తప్తాయః పిణ్డవదేకత్వేనావ భాసమానం తత్పదవాచ్యార్థోభవతి**

అజ్ఞానాదుల సమష్టి (అనగాఅజ్ఞానము, సూక్ష్మశరీర, స్థూలశరీరముల సమష్టి), విరాట్టు, అజ్ఞాన ఉపాధిలేని శుద్ధచైతన్యము, తురీయబ్రహ్మ చైతన్యము -- ఈమూడు కాల్చిన ఇమమువలె- ఏకముగా భాసింప బడుటచే తత్ అనుపదమునకు వాచ్యార్థమగును.

**145. ఏతదుపాధ్యుపహితాధారభూతమనుపహితం చైతన్యం తత్పదలక్ష్యార్థో భవతి ॥**

ఈ ఉపాధికి, ఉపాధిచే కూడుకొనిన ఈశ్వరాది చైతన్యములకు ఆధారమైనది, ఉపాధిరహితమైన బ్రహ్మ చైతన్యము తత్ అనే పదమునకు లక్ష్యార్థమగును

**146.అజ్ఞానాదివ్యష్టిరేతదుపహితాల్పజ్ఞత్వాదివిశిష్టచైతన్యమేతదుపహితం చైతత్త్రయం తప్తాయః పిణ్డవదేకత్వేనావభాసమానం త్వమ్పదవాచ్యార్థో భవతి ।**

అజ్ఞానాదుల వ్యష్టి (అనగా అజ్ఞానము, సూక్ష్మశరీరము, స్థూలశరీరము) ఆజ్ఞానాదులచే కప్పబడిన అల్పజ్ఞత్వాదిగుణ విశిష్టుడైన ప్రాజ్ఞ, తైజస విశ్వ చైతన్యము, ప్రాజ్ఞాది చైతన్యములకు ఆధారమైనది, ఉపాధిరహితమైన చైతన్యము - ఈమూడు కాల్చిన ఇనుమువలె -

ఏకముగా భాసింపబడుటచే త్వమ్ పదమునకు వాచ్యార్థమగును.

**147. ఏతతదుపాధ్యుపహితాధారభూతమనుపహితం ప్రత్యగానన్దం తురీయం చైతన్యం త్వమ్పదలక్ష్యార్థో భవతి ॥**

ఈ ఉపాధికి, ఉపాధిచే కప్పబడిన ప్రాజ్ఞాదులకు ఆశ్రయమైనది, ఉపాధిరహితమైన ప్రత్యగానంద తురీయ (నాలుగవ) చైతవ్యము త్వమ్ పదమునకు లక్ష్యార్థమగును.

**మహావాక్యార్థము**

**148. అథ మహావాక్యార్థో వర్ణ్యతే । ఇదం తత్త్వమసీతి వాక్యం సమ్బన్ధ త్రయేణాఽఖణ్డార్థబోధకం భవతి ॥**

మహావాక్యార్థము వివరించబడుచున్నది :- ఈ తత్త్వమసి' అను మహావాక్యము మూడువిధములైన సంబంధములతో అఖండ ఏకార్థ బోధకమగును.

**149.సమ్బన్ధత్రయం నామ పదయోః సామానాధికరణ్యం పదార్థయో ర్విశేషణవిశేష్యభావః ప్రత్యగాత్మలక్షణయోర్లక్ష్యలక్షణభావశ్చేతి ॥**

మూడుసంబంధములు :- 1). పదములకు సామానాధికరణ్యము

2) పదముల అర్థములందు విశేషణ విశేష్యభావము.

3). ప్రత్యగాత్మ లక్షణములుగా లక్ష్యలక్షణబావము.

**150. తదుక్తమ్ -**

**సామానాధికరణ్యఞ్చ విశేషణవిశేష్యతా ।**

**లక్ష్యలక్షణసమ్బన్ధః పదార్థప్రత్యగాత్మనామ్ ఇతి ॥**

తత్, త్వం అనురెండుపదములు ఒకేఅధికరణమున ఉన్నచో సామానాది కరణ్యము. రెండుపదములలో ఒకటివిశేష్యము, ఇంకొకటి విశేషణమైనచో విశేషణ విశేష్యభావము. ప్రత్యగాత్మ లక్ష్య మై, ఈ రెండు పదములు దానికి లక్షణములైతే లక్ష్యలక్షణభావము. కావుననే ప్రత్యగాత్మ పదార్థ బోధయందు సామానాధికరణ్య, విశేషణ విశేష్యభావ, లక్ష్య

(కనిపిస్తున్న) చైతన్యమును బోధించును. ఈరెండు పదముల అర్థములు ఒకే వస్తువు (చైతన్యము) నందు అభిన్నరూపముగా తాత్పర్యము కలిగియున్నవి. కావున, ఈరెండుపదముల అర్థములకు పరస్పరము విశేష్యవిశేషణ భావసంబంధమున్నది.

**153. లక్ష్యలక్షణసమ్బన్ధస్తు యథా తత్రైవ వాక్యేసశబ్దాయంశబ్దయోస్తదర్థ యోర్వా- విరుద్ధతత్కాలేతత్కాలవిశిష్టపరిత్యాగేనావిరుద్ధదేవదత్తేన సహ లక్ష్యలక్షణభావః తథాత్రాపి వాక్యే తత్త్వం పదయోస్తదర్థయోర్వా విరుద్ధపరోక్షత్వాపరోక్షత్వాదివిశిష్ట- త్వపరిత్యాగేనావిరుద్ధచైతన్యేన సహ లక్ష్యలక్షణభావః ।**

లక్ష్య లక్షణభావసంబంధము :- సోఽయం దేవదత్తః అను వాక్యములోని సః పదము పూర్వకాల దృష్టత్వమును, అయం పదము వర్తమానకాల దృష్టత్వమును బోదించును. ఈ పరస్పర విరుద్ధములైన రెండుఅర్థములను వదలిపెట్టి కేవలము దేవదత్తుణ్ణి బోధించునని స్వీకరించి, దేవదత్తుని లక్ష్యముగా సః అయం అను పదములు లక్షణములుగా పేర్కొనినందున లక్ష్యలక్షణబావ సంబందము. అట్లే తత్త్వమసి అను వాక్యములోని తత్ పదము పరోక్షార్థమును, త్వం ప్రత్యక్షార్థమును బోధించును. ఇవి పరస్పర విరుద్ధములు కావున ఈ రెండింటిని వదలిపెట్టి, కేవలము, చైతన్యమునే. బోధించునని స్వీకరించ వలయును. ఇక్కడ చైతన్యము లక్ష్యము తత్ త్వం అను రెండు పదములు లక్షణములు అని చెప్పుటచే ఇది లక్ష్యలక్షణభావసంబంధము.

**154. ఇయమేవ భాగలక్షణేత్యుచ్యతే**

దీనినే శాస్త్రకారులు భాగలక్షణ అని చెప్పుదురు.

**సంసర్గబోద ఖండనము.**

**155. అస్మిన్ వాక్యే నీలముత్పలమితి వాక్యవద్వాక్యార్థో న సఙ్గచ్ఛతే ॥**

తత్త్వమసి అనుమహావాక్యములో నీలముత్పలమ్ అను

వాక్యములో చెప్పినటుల విశేష్యవిశేషణభావ వాక్యార్థము కుదురదు

**156. తత్ర తు నీలపదార్థనీలగుణస్యోత్పలపదార్థోత్పలద్రవ్యస్య చ శౌక్ల్యోపాదిభేదవ్యావర్తకతయాఽన్యోన్యవిశేషణవిశేష్యభావసంసర్గస్యాన్యతర విశిష్టస్యాన్యతరస్య తదైక్యస్య వా వాక్యార్థత్వాఙ్గీకారే ప్రమాణాన్తర విరోధాభావాత్తద్వాక్యార్థః సఙ్గచ్ఛతే**

నీలముత్పలమ్ అను వాక్యమున నీలపదమునకు అర్థమైన నీలిరంగు శుక్లాదిరంగులకంటె భిన్నమైనదని, ఉత్పలపదమునకు అర్థమైన కలువపూవు వస్త్రాదిద్రవ్యములకంటె భిన్నమైనదని ఇతర వ్యావర్తకము కావున నీల,ఉత్పలములకు పరస్పరము విశేష్యవిశేషణబావ సంబంధము లేదా ఒకపదముతో ఇంకొక పదము కలసి వాక్యార్థము (సంసర్గవాక్యార్థము) ను బోధించుటలో, ప్రత్యక్షానుమానాది ప్రమాణ ములతో విరోధము లేనందున వాక్యార్థము కుదురును.

**157. అత్ర తు తదర్థపరోక్షత్వాదివిశిష్టచైతన్యస్య త్వమర్థాపరోక్షత్వాది విశిష్టచైత- న్యస్య చాన్యోన్యభేదవ్యావర్తకతయా విశేషణవిశేష్యభావ సంసర్గస్యాన్యతరవిశిష్టస్యా- న్యతరస్య తదైక్యస్య చ వాక్యార్థత్వాఙ్గీకారే ప్రత్యక్షాదిప్రమాణవిరోధాద్వాక్యార్థో న సఙ్గచ్ఛతే**

కాని తత్త్వమసి అనుచోట తత్ పదమునకు అర్థమైన పరోక్ష త్వాదివిశిష్టచైతన్యము, త్వం ఫదమునకు అర్థమైన అపరోక్షత్వాది విశిష్టచైతన్యమును ఇతరవ్యావర్త కములుగా అంగీకరించి తత్, త్వం పదములకు పరస్పరము విశేష్యవిశేషణభావ సంబంధ ము లేదా ఒక పదము ఇంకొక పదముతో కలిసి వాక్యార్థమును(సంసర్గవాక్యార్థమును) బోధించునని చెప్పినచో తత్, త్వం పదములకు అర్థములైన పరోక్షత్వ, అపరోక్షత్వాదులు విరుద్ధధర్మములైనందున ఒక చోట ఉండుట ప్రత్యక్షాది ప్రమాణ విరుద్ధము కావున వాక్యార్థము కుదరదు.

**158. తదుక్తమ్ --**

**సంసర్గో వా విశిష్టో వా వాక్యార్థో నాత్ర సమ్మతః**
**అఖణ్డైకరసత్వేన వాక్యార్థో విదుషాం మతః ॥**

కావుననే సంసర్గము, అథవా విశేష్య విశేషణభావ సంబంధముతో వాక్యార్థము కుదరదు. అఖండైకరసముగా (తత్త్వమసి వాక్యము బ్రహ్మ బోధకముగా) అభిన్నముగా వాక్యార్థమే విద్వాంసుల అభిమతము, అని పంచదశి (7-75) పేర్కొను చున్నది.

**జహల్లక్షణాఖండనము**

**159. అత్ర గఙ్గాయాం ఘోషః ప్రతివసతి' ఇతి వాక్యవజ్జహల్లక్షణాపి న సఙ్గచ్ఛతే**

గంగాయాం ఘోషః ప్రతివసతి (గంగలో గొల్లపల్లె ఉన్నది) అను వాక్యములోలాగా జహల్లక్షణాద్వారా వాక్యార్థమును బోధించుట కూడా కుదరదు.

**160. తత్ర తు గఙ్గాఘోషయోరాదారాధేయభావలక్షణస్య వాక్యార్థస్యాశేషతో విరుద్ధత్వాద్వాక్యార్థమశేషతః పరిత్యజ్య తత్సమ్బన్ధితీరలక్షణాయా యుక్తత్వాజ్జహ- ల్లక్షణా సఙ్గచ్ఛతే**

గంగలో గొల్లపల్లె అను వాక్యములో గంగాయాం=గంగా ప్రవాహములో, ఘోషః=గొల్లపల్లె, గంగాప్రవాహములో గొల్లపల్లె అని వాక్యార్థము. ప్రవాహములో పల్లె ఉండుట సంభవించదు. గంగా, ఘోషములకు ఆదారాధేయభావ లక్షణమైన వాక్యార్థము పూర్తిగా విరుద్ధము (అసంబవము) కావున, సంపూర్ణవాక్యార్థమును వదిలిపెట్టి గంగా పదమునకు గంగాసంబంధి తీరమను అర్థమును జహల్లక్షణచే స్వీకరించి నందున వాక్యార్థము కుదురును.

**161. అత్ర తు పరోక్షాపరోక్షచైతన్యైకత్వలక్షణస్య వాక్యార్థస్య భాగమాత్రే విరోధా- ద్భాగాన్తరమపి పరిత్యజ్యాన్యలక్షణాయా అయుక్తత్వాజ్జహల్లక్షణా న సఙ్గచ్ఛతే ॥**

తత్త్వమసి అనువాక్యములో తత్ = పరోక్షత్వవిశిష్ఠచైతన్యము, త్వమ్ = అపరోక్షత్వ (ప్రత్యక్షత్వ) విశిష్ఠచైతన్యము, పరోక్షత్వాపరోక్షత్వ విశిష్ఠ చైతన్యము అని వాక్యార్థము. ఈ పరోక్షత్వ, అపరోక్షత్వ విశిష్ఠ చైతన్యములు రెండు ఒక్కటే అనుటలో సర్వాత్మనా విరోధము లేదు. విరోధము కేవలము పరోక్ష వైశిష్ఠ్య,అపరోక్ష వైశిష్ఠ్యములను భాగము నందు మాత్రమే ఉన్నది, మిగిలిన చైతన్యాంశము ఉభయసామాన్యము కావున విరోధములేదు. కావునలక్షణను చెప్పునపుడు, కేవలము విరుద్ధాంశములను వదలి పెట్టుట న్యాయముకాని ఉభయసామాన్యమైన చైతన్యాంశమును వదలిపెట్ట నవసరములేదు. కావున ఇక్కడ జహల్లక్షణ కుదరదు.

**162. న చ గఙ్గాపదం స్వార్థపరిత్యాగేన తీరపదార్థం యథా లక్షయతి తథా తత్పదం త్వంపదం వా స్వార్థపరిత్యాగేన త్వంపదార్థం తత్పదార్థం వా లక్షయత్వతః కుతో జహల్లక్షణా న సఙ్గచ్ఛత ఇతి వాచ్యమ్ ॥**

గంగా పదమునకు వాచ్యార్థమైన ప్రవాహమును వదలిపెట్టి లక్షణ ద్వారా తీరమను అర్థము ఎట్లుగ్రహించబడుతుందో, అట్లె 'తత్ పదమునకు కూడా వాచ్యార్థము వదలిపెట్టి, త్వం పదముయొక్క అర్థమును, అథవా త్వం పదమునకు వాచ్యార్థమును వదిలిపెట్టి తత్ పదముయొక్క వాచ్యార్థమునైనా జహత్స్వార్థలక్షణ ద్వారా గ్రహించవచ్చును. (అని ఆశంక).

**163. తత్ర తీరపదాశ్రవణేన తదర్థాప్రతీతౌ లక్షణయా తత్ప్రతీత్యపేక్షాయామపి తత్త్వమ్పదయోః శ్రూయమాణత్వేన తదర్థప్రతీతౌ లక్షణయా పునరన్యతరపదేనాన్యతరపదార్థప్రతీత్యపేక్షా భావాత్ ।**

గంగాయాంఘోషః అను వాక్యములో తీరమను శబ్దము ఉచ్చరించ బడలేదు. కావున తీరమను అర్థమును అపేక్షించుకొని జహత్స్వార్థ

లక్షణావృత్తి కుదురును. కాని తత్త్వమసి, అను వాక్యములో తత్ త్వం అను రెండు పదములు. రెండు పదములకు అర్థములు కూడా ప్రసిద్ధముగా ఉన్నవి, కావున లక్షణద్వారా ఒక పదమునకు, ఇంకొక పదము యొక్క అర్థమును చెప్పవలసిన అవసరము లేదు, కావున ఇక్కడ జహత్స్వార్థలక్షణావృత్తి కుదరదు (అనిసమాధానము). అర్థాత్ ఒక వాక్యమును వినగానే, ఆవాక్యముఖ్యార్థమును తీసికోన్నచో విరోధము రాగా, అక్కడ ముఖ్యార్థమునకు సంబంధించినది, పదము చేతవినిపించని ఇంకొకఅర్థమును గ్రహించుట జహల్లక్షణ.

**అజహల్లక్షణా ఖండనము**

**164. అత్రశోణో ధావతీతివాక్యవదజహల్లక్షణాపి న సమ్భవతి ॥**

శోణోధావతి అను వాక్యములో అజహత్స్వార్థలక్షణనుగ్రహించినట్లుగ తత్వమసి వాక్యములో అజహత్స్వార్థలక్షణ కుదరదు.

**165. తత్ర శోణగుణగమనలక్షణస్య వాక్యార్థస్య విరుద్ధత్వాత్తదపరిత్యాగేన తదాశ్రయాశ్వాదిలక్షణయా తద్విరోధపరిహారసమ్భవాదజహల్లక్షణా సమ్భవతి ।**

శోణో ధావతి శోణః = ఎరుపురంగు, ధావతి = పరుగెత్తుచున్నది. ఎరుపురంగుకు వెళ్ళుట అనుక్రియకుదరదని బాధ ఆవిరోధమును పరిహరించుటకై, శోణపదమునకు అజహల్లక్షణచే ముఖ్యార్థమును వదిలిపెట్టకయే, ఆముఖ్యార్థమునకు ఆశ్రయ మైనప్రాణి ఎరుపురంగుగల గుర్రముఅను అర్థము గ్రహించబడును. ఎర్రని గుర్రము పరుగెత్తుచున్నది అని చెప్పివిరోధము పరిహరింపజేయుటచే అజహల్లక్షణ కుదురును.

**166. అత్ర తు పరోక్షత్వాపరోక్షత్వాదివిశిష్టచైతన్యైకత్వస్య వాక్యార్థస్య విరుద్ధత్వా త్తదపరిత్యాగేన తత్సమ్బన్ధినో యస్య కస్యచిదర్థస్య లక్షితత్వేఽపి తద్విరోధపరిహారా సమ్భవాదజహల్లక్షణా న సమ్భవత్యేవ ॥**

తత్త్వమసి అనువాక్యములో తత్ =పరోక్షచైతన్యము, త్వమ్

=ప్రత్యక్షచైతన్యము. వాక్యార్థములో ఒకే వ్యక్తి పరోక్షము, ప్రత్యక్షము అని చెప్పుట విరోధము. ఆవిరుద్ధాంశములను త్యజించక లక్షణావృత్తిచే పరోక్ష, ప్రత్యక్ష సంబంధితమైన ఏ అర్థమును గ్రహించినప్పటికిని విరోధము పరిహరింపబడదు. కావున అజహాత్స్వార్థలక్షణ కుదరదు.

**బాగలక్షణసమర్థనము**

**167. న చ తత్పదం త్వంపదం వా స్వార్థవిరుద్ధాంశపరిత్యాగేనాంశాన్తరసహితం త్వమ్పదార్థం తత్పదార్థం వా లక్షయత్వతః కథం ప్రకారాన్తరేణ భాగలక్షణాఙ్గీకరణమితి వాచ్యమ్**

తత్, త్వమ్మను పదములు తమతమ అర్థములలో విరుద్ధములైన అంశములను వదిలిపెట్టి, ఉభయసామాన్యములైన అంశములతో కూడు కొనిన అర్థములను లక్షణావృత్తిచే బోధింపవచ్చును కావున భాగలక్షణ అను ఇంకొక లక్షణాప్రకారమవ- సరము లేదని ఆశంక.

**168. ఏకేన పదేన స్వార్థాంశపదార్థాన్తరోభయలక్షణాయా అసమ్భవా త్పదాన్తరేణ తదర్థప్రతీతౌ లక్షణయా పునస్తత్ప్రతీత్యపేక్షాభావాచ్చ ।**

ఒక పదము (తత్ అదవాత్వమ్) ఆపదము యొక్క అర్థములో విరుద్ధమైన(పరోక్ష, ప్రత్యక్ష) అంశమును త్యజించి అవిరుద్ధమైన చైతన్యాంశమును లక్షణద్వారాబోధించుట, రెండవపదము యొక్క వాచ్యార్థమునుకూడా లక్షణద్వారా బోధించుట అను రెండుపనులు లక్షణావృత్తిచేయలేదు. ఇంకొకశబ్దము ద్వారా స్వయముగానే ఆ అర్థము అభిధచే తెలియునప్పుడు లక్షణచే మరల లక్షింపబడునని చెప్పవలసిన అవసరము లేదని సమాధానము.

**169.తస్మాద్యథా సోఽయం దేవదత్త ఇతి వాక్యం తదర్థో వా తత్కాలై తత్కాలవిశిష్టదేవదత్తలక్షణస్య వాక్యార్థస్యాంశే విరోధాద్విరుద్ధతత్కాలై తత్కాలవిశిష్టాంశం పరిత్యజ్యావిరుద్ధం దేవదత్తాంశమాత్రం లక్షయతి తథా తత్త్వమసీతివాక్యం తదర్థో వా పరోక్షత్వాపరోక్షత్వాది విశిష్టచైతన్యైకత్వ**

**లక్షణస్య వాక్యార్థస్యాంశే విరోధాద్విరుద్ధపరోక్షత్వాపరోక్షత్వ విశిష్టాంశం పరిత్యజ్యావిరుద్ధ మఖణ్డచైతన్యమాత్రం లక్షయతీతి**

సోऽయందేవదత్తః అను వాక్యమునందు సః = పూర్వము చూచిన, అయం = ఇప్పుడు చూచిన దేవదత్తః = దేవదత్తుడు, పూర్వద్రష్టృత్వ, వర్తమాన ద్రష్టృత్వ ములను విరుద్ధాంశములను త్యజించి, దేవదత్తుడను అర్థము మాత్రమే జహద జహల్లక్షణావృత్తి బోధించుచున్నది. అట్లే తత్త్వమసి అనువాక్యమునందుకూడ తత్ = పరోక్ష చైతన్యము, త్వం = ప్రత్యక్ష చైతన్యము, ఆరెండును ఒక్కటే చైత్యన్యముయొక్కరూపము అను అర్థములో విరోదము లేదు. కేవలము పరోక్ష, ప్రత్యక్ష అంశముల విషయమున విరోధమున్నది. కావున ఆవిరుద్ధములైన పరోక్ష, ప్రత్యక్షాంశ ములను త్యజించి, అవిరుద్ధమైన చైతన్యమను అంశమాత్రమే జహద హజల్లక్షణచే లక్షితమగును.

**అనుభవవాక్యార్థము**

170. **అథాధునాహం బ్రహ్మాస్మి ఇత్యనుభవవాక్యార్థో వర్ణ్యతే ॥**

అహంబ్రహ్మాస్మి (బృ ఉ.1-4-10) అను అనుభవ వాక్య అర్థము నిరూపించబడుచున్నది.

171. **ఏవమాచార్యేణాధ్యారోపాపవాదపురఃసరం తత్త్వమ్పదార్థౌ శోధయిత్వా వాక్యేనాఖణ్డార్థేऽవబోధితేऽధికారిణోऽహం నిత్యశుద్ధబుద్ధ ముక్తసత్యస్వభావపరమా నన్దాऽనన్తాద్వయం బ్రహ్మాస్మీత్యఖణ్డాకారా కారితా చిత్తవృత్తిరుదేతి**

ఈవిధముగా గురువు అద్యారోప, అపవాదన్యాయములచే తత్,త్వమ్ పదముల అర్థములబోధించి తత్త్వమసి అను వాక్యము ద్వారా అఖండార్థమును (వాక్యసంపూర్ణార్థమును) బోధించగా అధికారికి నేను నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, సత్యస్వభావ, పరమానంద, అనంత, అద్వితీయ బ్రహ్మమును" అను అఖండాకారాశ్రితమైన చిత్తవృత్తి

ఉదయించును.

**172. సా తు చిత్ప్రతిబిమ్బసహితా సతీ ప్రత్యగభిన్నమజ్ఞాతం పరం బ్రహ్మ విషయీకృత్య తద్గతాజ్ఞానమేవ బాధతే తదా పటకారణతన్తుదాహే పటదాహవదఖి- లకారణేఽజ్ఞానే బాధితే సతి తత్కార్యస్యాఖిలస్య బాధితత్వాత్తదన్తర్భూతాఖణ్డాకారాకారితా చిత్తవృత్తిరపి బాధితా భవతి ।**

ఆచిత్తవృత్తి-చిత్తు యొక్కబింబముచే ప్రతిబింబితమగును. ఆచిత్తవృత్తి చైతన్యముద్వారా ప్రకాశించబడిన చిదాభాసము, ప్రత్యగాత్మ(జీవబ్రహ్మల అభేద) స్వరూపమునై పరబ్రహ్మవిషయకమైన అజ్ఞానమును నశింప చేయును. వస్త్రము యొక్క దారములన్ని నశించగా, వస్త్రము ఎట్లు నశించునో, అట్లే సమస్త సంసార బంధమునకు కారణమైన అజ్ఞానము నశించగా, దాని అంతర్గతమైన అఖండాకార అంతఃకరణవృత్తి కూడా నశించును.

**173. తత్ర ప్రతిబిమ్బితం చైతన్యమపి యథాదీపప్రభాదిత్యప్రభావభాసనాసమర్థాసతీతయాభిభూతా భవతి తథా స్వయమ్ప్రకాశమాన ప్రత్యగభిన్నపరబ్రహ్మావభా- సనానర్హతయా తేనాభిభూతం సత్ స్వోపాధిభూతాఖణ్డవృత్తేర్బాధితత్వాద్దర్పణాభావే ముఖప్రతిబిమ్బస్య ముఖమాత్రత్వవత్ప్రత్యగభిన్నపరబ్రహ్మమాత్రం భవతి ।**

సూర్యుని కాంతిముందు దీపకాంతి వెలవెలబోవుచు, కాంతిహీనమగును. అట్లే అంతఃకరణ వృత్తి యందు ప్రతిబింబించిన చైతన్యము స్వయం ప్రకాశమైన బ్రహ్మ చైతన్యము ముందు కాంతిహీనమగును. స్వయం ప్రకాశమైన బ్రహ్మ చైతన్యముచే స్వయముగా తిరస్కరించబడును. అద్దము లేనప్పుడు ముఖ ప్రతిబింబము ముఖముగానే ఉన్నట్లుగా ఉపాధి అయిన అంతఃకరణవృత్తి లేనప్పుడు, స్వయం ప్రకాశమైన పరబ్రహ్మముగానే ఉండునని జ్ఞానులు అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మమును) అను అనుభవమును పొందుదురు.

శ్రుత్యవిరోద కథనము

**174. ఏవం చ సతి మనసైవానుద్రష్టవ్యం యన్మనసా న మనుతే ఇత్యనయోః శ్రుత్యోరవిరోధో వృత్తివ్యాప్యత్వాఙ్గీకారేణ ఫలవ్యాప్యత్వ ప్రతిషేధప్రతిపాదనాత్ ।**

ఈ అనుభవానంతరము బ్రహ్మమును కేవలము మనస్సుచేతనే తెలుసు కోవచ్చును (బృ.ఉ. 4-4-11) బ్రహ్మమును మనస్సుచే తెలుసు కొనరాదు (కే.ఉ 1-5) ఇత్యాది పరస్పర విరుద్ధము లైన శ్రుతివాక్యముల విరోధముకూడా దూరమగును. మనస్సుచే తెలుసుకొనరాదు అనగా ఫలము ను గ్రహించవలెను మనస్సుచేతనే తెలుసుకొనవచ్చును అనగా వృత్తినిగ్రహించవలెను. మనోవృత్తిద్వారా బ్రహ్మ విషయక అజ్ఞానము నశించును. అంతఃకరణ వృత్తిలో ప్రతిబింబించిన చైతన్యముబ్రహ్మమును ప్రకాశింపజేయదని భావము.

**175. తదుక్తం---**

**ఫలవ్యాప్యత్వమేవాస్య శాస్త్రకృద్భిర్నివారితమ్ ।**
**బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తివ్యాప్తిరపేక్షితా ఇతి ॥**

'శాస్త్రకారులు అంతఃకరణమునందు ప్రతిబింబించిన చైతన్యము ద్వారా బ్రహ్మప్రకాశమును నిషేధించుచు, అంతఃకరణవృత్తిద్వారానే తద్విషయక అజ్ఞాననాశమును స్వీకరించినారు. అని పంచదశి (6-80) బోధించుచున్నది.

**176. 'స్వయమ్ప్రకాశమానత్వాన్నాభాస ఉపయుజ్యతే , ఇతి చ ।**

బ్రహ్మము స్వయంప్రకాశకము కావున వేరేదానివలన ప్రకాశించదని చెప్పుట యుక్తి యుక్తమని పంచదశి (6 - 92).

**177. జడపదార్థాకారాకారితచిత్తవృత్తేర్విశేషోఽస్తి ॥**

అఖండకారమైన అంతఃకరణవృత్తికి, ఘటాది జడపదార్థాకారమైన అంతఃకరణవృత్తికి కొంచెము భేదమున్నది.

**178. తథాహి అయం ఘట ఇతి ఘటాకారాకారితచిత్తవృత్తిరజ్ఞాతం ఘటం విషయీకృత్య తద్గతాజ్ఞాననిరసనపురఃసరం స్వగతచిదాభాసేన జడం ఘటమపి భాసయతి ॥**

ఘటప్రత్యక్షసమయమున ఘటాకారమైన చిత్తవృత్తి, తెలియని ఘటమును విషయము చేసికొని, ఘట విషయక అజ్ఞానమును (తెలియక పోవుటను) నశింప చేయును. అంతఃకరణవృత్తి ప్రతిభింబముద్వారా అనగా స్వగత చిదాభాసముద్వారా, ఘటమును తెలియజేయును.

**179. తదుక్తం--**

**బుద్ధితత్స్థచిదాభాసౌ ద్వావపి వ్యాప్నుతో ఘటమ్**
**తత్రాజ్ఞానం ధియా నశ్యేదాభాసేన ఘటః స్ఫురేత్ ఇతి।**

'అంతఃకరణము, దానియందు ప్రతిబింబించిన చైతన్యము (చిదాభాసము) ఈరెండు ఘటమును వ్యాపించును. అంతఃకరణ వృత్తిద్వారా ఘటవిషయక అజ్ఞానము నశించును. చిదాభాసముద్వారా ఘటము స్ఫురించును' అని పంచదశి (7.91) బోధించుచున్నది.

**180. యథా దీపప్రభామణ్డలమన్ధకారగతం ఘటపటాదికం విషయీకృత్య తద్గతాన్ధకారనిరసనపురఃసరం స్వప్రభయా తదపి భాసయతీతి ॥**

దీపకాంతులు చీకటిలో ఉన్న ఘటపటాదులను వ్యాపించి, ఘటపటాది గతమైన అంధకారమును నశింపజేసి, ఘటపటాదులను ప్రకాశింప చేయును అట్లె, అంకఃకరణవృత్తి ఘటాది విషయక అజ్ఞానమును నశింపచేయును. అంతఃకరణమునందు ప్రతిబింబించిన చైతన్యము (చిదాభాసము) ఘటాదులను ప్రకాశింపజేయును.

**తత్వసాక్షాత్కారోపాయములు**

**181. ఏవంభూతస్వరూపచైతన్యసాక్షాత్కారపర్యన్తం శ్రవమణనన నిధి ధ్యాసన- సమాధ్యనుష్ఠానస్యాపేక్షితత్వాత్తేఽపి ప్రదర్శ్యన్తే**

ఆత్మసాక్షాత్కార మగునంతవరకు శ్రవణ, మనన, నిదిధ్యాసన,

సమాధ్యను- ష్ఠానములు అత్యంతావశ్యకములు కావున అవి నిరూపించ బడుచున్నవి

**182. శ్రవణం నామ షడ్విధలిఙ్గైరశేషవేదాన్తానామద్వితీయవస్తుని తాత్పర్యావధా రణమ్**

శ్రవణము :- ఆరు విధములైన లింగముల (హేతువుల)ద్వారా అఖండబ్రహ్మము నందే సంపూర్ణ వేదాంతతాత్పర్యమను నిశ్చయము.

**183. లిఙ్గాని తూపక్రమోపసంహారాభ్యాసాపూర్వతాఫలార్థవాదోప పత్త్యాఖ్యాని ॥**

షడ్విధలింగములు :- 1.ఉపక్రమ, ఉపసంహారములు, 2. అభ్యాసము, 3. అపూర్వత 4. ఫలము 5.అర్థవాదము 6.ఉపపత్తి.

**184. తత్ర ప్రకరణప్రతిపాద్యస్యార్థస్య తదాద్యన్తయోరుపపాద నముప క్రమోపసంహారౌ । యథా ఛాన్దోగ్యే షష్ఠాధ్యాయే ప్రకరణప్రతిపాద్యస్యా ద్వితీయవస్తునః ఏకమేవాద్వితీయమ్ (6 - 2- 1) ఇత్యాదౌ ఐతదాత్మ్య మిదం సర్వమ్ (6 - 8 - 7) ఇత్యన్తే చ ప్రతిపాదనమ్ ।**

ఉపక్రమోపసంహారములు :- ఒక అధ్యాయమున చెప్పదలచిన విషయమును, ఆ అధ్యాయ ఆదినుండి (ఉపక్రమమునుండి) అంతము (ఉపసంహారము) వరకు ప్రతిపాదించుట. ఉదా - ఛాందోగ్యోపనిషత్ ఆరవఅధ్యాయారంభమున అద్వితీయమైన బ్రహ్మమొక్కటె (6 - 2 - 1) అని ఉపక్రమించి, అధ్యాయాంతమున "ఇదంతయు ఆత్మతత్వమే (6 - 8 - 7) అని ఆదినుండి అంతము వరకు అద్వైతత్వమే ప్రతిపాదించ బడినది.

**185. ప్రకారేణప్రతిపాద్యస్య వస్తునస్తన్మధ్యే పౌనఃపున్యేన ప్రతిపాదన మభ్యాసః ।యథా తత్రైవాద్వితీయవస్తునో మధ్యే తత్త్వమసీతి నవకృత్వః ప్రతిపాదనమ్ ॥**

అభ్యాసము :- ప్రతిపాదించదలచిన విషయమును మాటిమాటికి చెప్పుట. ఉదా - ఛాందోగ్యోపనిషత్ ఆరవ అధ్యాయమున తత్త్వమసి

వాక్యము తొమ్మిదిసార్లు పేర్కొనబడినది.

**186. ప్రకరణప్రతిపాద్యస్యాద్వితీయవస్తునః ప్రమాణాన్తరావిషయీకరణమపూర్వతా। యథా తత్రైవాద్వితీయవస్తునో మానాన్తరా విషయీకరణమ్ ॥**

అపూర్వత ః- ప్రకరణమున ప్రతిపాదించ దలచిన అద్వితీయ వస్తువిషయమున వేరుప్రమాణాలు లేవని చెప్పుట. ఉదా - ఛాందోగ్యోపనిషత్తు- నందే ప్రతిపాదించదలచిన అఖండబ్రహ్మ విషయమున వేరుప్రమాణములు లేవని చెప్పబడినది.

**187. ఫలం తు ప్రకరణప్రతిపాద్యస్యాత్మజ్ఞానస్య తదనుష్ఠానస్య వా తత్ర తత్ర శ్రూయమాణం ప్రయోజనమ్ యథా తత్ర ఆచార్యవాన్పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేऽథ సమ్పత్స్య ఇత్యద్వితీయవస్తుజ్ఞానస్య తత్ప్రాప్తిః ప్రయోజనం శ్రూయతే ॥**

ఫలము ః- ప్రతిపాదించు విషయమువలన, అథవా ఆవిషయ అనుష్ఠానము వలన కలుగు ప్రయోజనమును పేర్కొనుట. ఉదా - అక్కడనే (ఛాందోగ్య ఆరవ - అధ్యాయములోనే) గురువును కలిగి ఉన్నవాడు బ్రహ్మమును తెలుసుకొనును. ఆబ్రహ్మజ్ఞాని శరీరపాతము వరకు ఎదురుచూచి, బ్రహ్మలో కలిసి పోవును (6-14-2) అని బ్రహ్మజ్ఞానమునకు బ్రహ్మప్రాప్తి ప్రయోజనము చెప్పబడినది.

**188. ప్రకరణప్రతిపాద్యస్య తత్ర తత్ర ప్రశంసనమర్థవాదః యథా తత్రైవ ఉత తమాదేశమప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమ్ ఇత్యద్వితీయవస్తుప్రశంసనమ్**

అర్థవాదము ః- ప్రతిపాదించు విషయమును స్తుతించుట. ఉదా - అక్కడే 'ఆ బ్రహ్మస్వరూపమును గూర్చి అడిగినావు. దానిని విన్నచో, అన్నియువిన్నట్లగును. దానిని గుర్చి చింతించినచో, అన్నియు చింతించినట్లగును. దానిని తెలుసుకున్నచో అన్నియు తెలియును' (6

6-4) అని బ్రహ్మజ్ఞానము స్తుతింపబడినది.

**189. ప్రకరణప్రతిపాద్యార్థసాధనే తత్ర తత్ర శ్రూయమాణా యుక్తి రుపపత్తిః । యథా తత్ర యథా సౌమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్ ఇత్యాదావద్వితీయవస్తుసాధనే వికారస్య వాచారమ్భణమాత్రత్వే యుక్తిః శ్రూయతే॥**

ఉపపత్తి :- ప్రకరణమున ప్రతిపాదించు విషయమును సాధించుటలో అక్కడక్కడ వినిపించుయుక్తులు. ఉదా - అక్కడే 'ఓ సౌమ్యుడా! ఒక మట్టిముద్ద చేత సమస్త మట్టి పాత్రలజ్ఞానము కలుగును. మట్టిచేత తయారు చేయబడినవై, కొత్తకొత్తపేర్లతో పిలువబడుచున్నవి. వాస్తవంగా అవన్నియు మట్టియే' (6 - 1- 4) అని బ్రహ్మప్రతిపాదనలో మట్టిపాత్రల యుక్తులు పేర్కొనబడినవి.

**190. మననం తు శ్రుతస్యాద్వితీయవస్తునో వేదాన్తానుగుణయుక్తిభిరన వరతమనుచిన్తనమ్**

మననము :- వేదాంతమునకు అనుకూలములైన యుక్తులద్వారా చాలాకాలమునుండి వినిన బ్రహ్మజ్ఞానమును ఎల్లప్పుడు చింతన చేయుట.

**191. విజాతీయదేహాదిప్రత్యయరహితాద్వితీయవస్తుసజాతీయప్రత్యయ ప్రవాహో నిదిధ్యాసనమ్ ॥**

నిదిధ్యాసనము :- తత్త్వజ్ఞానమునకు విరుద్ధములైన దేహాది జడపదార్థముల జ్ఞానమును వదలిపెట్టి, తత్వజ్ఞానమునకు అనుకూలము లైన బ్రహ్మజ్ఞాన విచారణలను ప్రవాహింపచేయుట.(కొనసాగించుట)

**సమాధినిరూపణము**

**192. సమాధిర్ద్వివిధః సవికల్పకో నిర్వికల్పకశ్చేతి ॥**

సవికల్పకసమాధి, నిర్వికల్పక సమాధి అని సమాది రెండువిధములు.

**193. తత్ర సవికల్పకో నామ జ్ఞాతృజ్ఞానాదివికల్పలయానపేక్షయా ద్వితీయవస్తుని తదాకారాకారితాయాశ్చిత్తవృత్తేరవస్థానమ్ ॥**

సవికల్పకసమాధి :- జ్ఞాత (తెలుసుకొనువాడు), జ్ఞేయం (తెలుసుకోదగినది) అను బేధజ్ఞానమున్నప్పటికిని, అద్వైతవస్తువు (బ్రహ్మము) నందు అఖండాకారమైన చిత్తవృత్తి ఉండుట.

194. తదా మృణ్మయగజాదిబానేऽపి మృద్భానవద్ద్వైత భానేऽప్య ద్వైతం వస్తు భాసతే

మట్టి ఏనుగు బొమ్మయందు ఏనుగు అను జ్ఞానమున్నప్పటికిని, మట్టి అనిజ్ఞానముండుమ. అట్లే జ్ఞాతృ, జ్ఞేయములను ద్వైత జ్ఞానమున్నప్పటికిని, అద్వైతభావము (నేనుబ్రహ్మము) కుదురును.

**195. తదుక్తం---**

**దృశిస్వరూపం గగనోపమం పరం సకృద్విభాతం త్వజమేక మక్షరమ్ అలేపకం సర్వగతం యదద్వయం తదేవ చాహం సతతం విముక్తమోమ్ ॥ ఇతి**

ఈ విషయమును ప్రతిపాదించు ఉపదేశసాహస్రీ(73-10-1)శ్లోకము :- ఇది సాక్షి స్వరూపము ఆకాశతుల్యము. అది ఎల్లప్పుడు ఒకేరూపమున ప్రకాశించును. అట్టి సర్వసాక్షి, సర్వవ్యాపి, సర్వోత్కృష్టము, స్వయంప్రకాశస్వరూపము, జన్మమృత్యు- రహితము, నిర్లిప్తము సదాముక్తస్వబావము, అద్వితీయమునైన బ్రహ్మమును నేను'

**196. నిర్వికల్పకస్తుజ్ఞాతృజ్ఞానాదివికల్పలయాపేక్షయాऽద్వితీయవస్తుని తదాకారాకారితాయాశ్చిత్తవృత్తేరతితరామేకీభావేనావస్థానమ్ ॥**

నిర్వికల్పకసమాధి :- జ్ఞాత (తెలుసుకొనువాడు) జ్ఞేయం (తెలుసుకోదగినది) అనుజ్ఞానము లోపించి, కేవలము బ్రహ్మమునందే అఖండాకారమైన చిత్తవృత్తి కలిగియుండుట.

**197. తదా తు జలాకారాకారితలవణానవభాసేన జలమాత్రావభాసవ**

**దద్వితీయవస్త్వాకారాకారితచిత్తవృత్త్యనవభాసేనాద్వితీయవస్తుమాత్రమవ భాసతే ॥**

నీళ్ళలో ఉప్పుకలపగా, ఆఉప్పు కరిగి కలసిపోగా, ఉప్పుఉందనే జ్ఞానము కూడపోయి, కేవలము నీళ్ళనే జ్ఞానము మాత్రమే కలుగును. అట్లే చిత్తవృత్తులన్నియు బ్రహ్మాకారము నొందగా, చిత్తవృత్తులున్నాయనే జ్ఞానముకూడా నశించగా, బ్రహ్మవిషయకజ్ఞానము మాత్రమే ఉండును. అనగా అఖండ బ్రహ్మమునందు చిత్తవృత్తులు కలసిపోగా, బ్రహ్మభిన్న మైన ఏజ్ఞానమునుఉండకపోగా; అంతయు బ్రహ్మమయమగును.

198. **తతశ్చాస్య సుషుప్తేశ్చాభేదశఙ్కా న భవతి ఉభయత్ర వృత్త్యభానే సమానేఽపి తత్సద్భావాసద్భావమాత్రేణానయోర్భేదోపపత్తేః ॥**

ఈవిధముగా నిర్వికల్పసమాధిలో, సుషుప్తిలోలాగా చిత్తవృత్తులు న్నాయనే జ్ఞానము సమసిపోవుట అనే అంశము సమానమైనప్పటికిని రెంటికి భేదము లేదని శంకించరాదు. ఎందుకనగా, సమాధిలో తెలియ కుండ చిత్తవృత్తులుండును. సుషుప్తిలో బొత్తిగా చిత్తవృత్తులుండవు కావున భేదము స్పష్టము.

### సమాధ్యంగములు

199. **అస్యాఙ్గాని యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధారణా ధ్యానసమాధయః ।**

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధిఅను ఎనిమిది నిర్వికల్ప సమాధికి అంగములు.

200. **తత్ర అహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహా యమాః ॥**

యమములు :- అహింస, సత్యము, అస్తేయము (దొంగలించక పోవుట) బ్రహ్మచర్యము, అపరిగ్రహము.

202. **శౌచసన్తోషతపఃస్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః ।**

నియమములు ః- శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము.

202. **కరచరణాదిసంస్థానవిశేషలక్షణాని పద్మస్వస్తికాదీన్యాసనాని ॥**

ఆసనము ః- కరచరణాదులను ఒకక్రమముగా ఉంచే పద్మాసనము, స్వస్తికాసనము మొదలగునవి.

203.**రేచకపూరకకుమ్భకలక్షణాః ప్రాణనిగ్రహోపాయాః ప్రాణాయామాః ॥**

ప్రాణాయామము ః- రేచకము (గాలిని వదలుట), పూరకము (గాలిని పీల్చుట) కుంభకము (గాలిని స్తంభింపజేయుట) అను లక్షణములతో ప్రాణవాయువును నిగ్రహించు ఉపాయము.

204. **ఇన్ద్రియాణాం స్వస్వవిషయేభ్యః ప్రత్యాహరణం ప్రత్యాహారః ।**

ప్రత్యాహారము ః- తమ తమ విషయములనుండి ఇంద్రియములను మరలించుట.

205. **అద్వితీయవస్తున్యన్తరిన్ద్రియధారణం ధారణా ॥**

ధారణ ః- బ్రహ్మమునందే అంతరింద్రియములను (మనో,బుద్ధి, చిత్తములను) ఉంచుట.

206. **తత్రాద్వితీయవస్తుని విచ్ఛిద్య విచ్ఛిద్యాన్తరిన్ద్రియవృత్తిప్రవాహో ధ్యానమ్ ।**

ధ్యానము ః- బ్రహ్మమునందే అంతఃకరణ వృత్తులను, నిలిపి, నిలిపి ప్రవర్తింపజేయుట.

207. **సమాధిస్తూక్తః సవికల్పక ఏవ ।**

సమాధి ః- పూర్వోక్త సవికల్పక సమాధియే.

**సమాధివిఘ్నములు**

208. **ఏవమస్యాఙ్గినో నిర్వికల్పకస్య లయవిక్షేపకషాయరసాస్వాద లక్షణాశ్చత్వారో విఘ్నాః సమ్భవన్తి ।**

యమాద్యష్టాంగములతో కూడుకొనిన నిర్వికల్పసమాధికి లయము,

**లయే సమ్బోధయేచ్చిత్తం విక్షిప్తం శమయేత్పునః**
**సకషాయం విజానీయాత్సమప్రాప్తం న చాలయేత్**
**నాస్వాదయేద్రసం తత్ర నిఃసఙ్గః ప్రజ్ఞయా భవేత్ ఇతి చ యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ఇతి చ ।**

'లయము అను విఘ్నమువచ్చినప్పుడు చిత్తమును సావధాన పరచవలెను. విక్షేపమను విఘ్నమువచ్చినప్పుడు చిత్తమును శాంతపరచవలెను. శాంతముగా నున్న చిత్తమును చాలాకాలము అట్లేఉంచి, సవికల్పకసమాధి ఆనందమునుండి ప్రజ్ఞద్వారా ఆసక్తి లేకుండా చేసి, ఆనందమును ఆస్వాదించవలయును'. (గౌడపాద కారిక 3-44-45) 'గాలిలేని చోట పెట్టినదీపము, ఎలాంటి చలనమునొందదు. అట్లె ఈ చిత్తము దానితో సమానమగును' అని (గీతలో 19) బోధించు చున్నది.

**జీవన్ముక్తలక్షణము**

**215. జీవన్ముక్తలక్షణముచ్యతే ।**

జీవన్ముక్తుని స్వరూపము నిరూపించ బడుచున్నది.

**216. జీవన్ముక్తో నామ స్వస్వరూపాఖణ్డబ్రహ్మజ్ఞానేన తదజ్ఞానబాధన ద్వారా స్వస్వరూపాఖణ్డబ్రహ్మణి సాక్షాత్కృతేऽజ్ఞానతత్కార్యసఞ్చిత కర్మ సంశయవిపర్యయాదీనామపి బాధితత్వాదఖిలబన్ధరహితో బ్రహ్మ నిష్ఠః ॥**

జీవన్ముక్తుడు :- తనస్వరూపమైన అఖండ బ్రహ్మజ్ఞానము ద్వారా తనలో ఉన్న అజ్ఞానమును తొలగించుకొని, తన స్వరూపమైన (అఖండ) బ్రహ్మమును దర్శించుటచే అజ్ఞానము, దానిచే ఉత్పన్నమైన సంచిత కర్మ, సందేహ, భ్రమలు నశించగా, సమస్త బంధనములనుండి ముక్తుడై బ్రహ్మమునందే నిష్ఠకలగినవాడు.

**217. భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః ।**

**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే "॥ ఇత్యాదిశ్రుతేః**

ఈ విషయములో ప్రమాణము ఈశ్రుతి 'అన్నిటికంటె ఉత్తమమైన పరబ్రహ్మమును దర్శించుటచే హృదయములోని భ్రమలన్నియు నశించును. సంశయములన్ని దూరమగును. మంచి చెడుకర్మల ఫలిత ములుకూడా నశించును'(ముండ. ఉ. 2-2-8).

కర్మభోగము

**218. అయం తు వ్యుత్థానసమయే మాంసశోణితమూత్రపురీషాది భాజనేన శరీరేణాన్ధ్యమాన్ద్యాపటుత్వాదిభాజనేనేన్ద్రియగ్రామేణాశనా పిపాసాశోకమోహాదిభా- భాజనేనాన్తఃకరణేన చ పూర్వపూర్వవాసనయా క్రియమాణాని కర్మాణి భుజ్యమానాని జ్ఞానావిరుద్ధారబ్ధఫలాని చ పశ్యన్నపి బాధితత్వాత్పరమార్థతో న పశ్యతి । యథేన్ద్రజాలమితి జ్ఞానవాంస్తదిన్ద్రజాలం పశ్యన్నపి పరమార్థమిదమితి న పశ్యతి ॥**

అట్లే ఈ జీవన్ముక్తుడు జాగ్రదవస్థలో రక్త, మాంస, మల, మూత్రాదు లకు నిలయమైన శరీరముతో గుడ్డితనము, చెవిటితనము మొదలగు దోషములకు నిలయమైన ఇంద్రియసమూహముతో ఆకలి, దప్పి, శోకము, మోహము మొదలగు వాటికి ఆధారమైన అంతఃకరణముతో పూర్వ, పూర్వ (జన్మల)వాసనలచే పుట్టు, జ్ఞానమార్గమునకు విరోధములైన ప్రారబ్ధ కర్మలఫలములను చూచుచుకూడా ఇంద్రజాలముచే కల్పించబడిన పదార్థములు నిజములు కానట్లుగాజగత్తంత మిథ్యఅని తలంచునని ఈ శ్రుతి.

**219. సచక్షురచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ ఇత్యాదిశ్రుతేః ॥**

'జీవన్ముక్తుడు ప్రాపంచిక విషయములలో కళ్ళుఉన్నప్పటికిని కళ్ళు లేనివానివలె,చెవులున్నప్పటికిని చెవులు లేనివానివలె, మనస్సు ఉన్నప్పటికిని మనస్సులేనివానివాలె వ్యవహరించును.

**220.ఉక్తఞ్చ --**

**సుషుప్తవజ్జాగ్రతి యో న పశ్యతి ద్వయం చ పశ్యన్నపి చాద్వయత్వతః తథా చ కుర్వన్నపి నిష్క్రియశ్చ యః స ఆత్మవిన్నాన్య ఇతీహ నిశ్చయః ।**

'అద్వైతము నిశ్చయముగా తెలియుట చేత, జాగ్రదవస్థలో చూచుచున్న ద్వైతమును, సుషుప్త్యవస్థలోని అద్వైతమువలె, లెక్కించడు. కర్మల నాచరించుచు కూడ కర్మలతో సంబంధమును ఉంచుకొనడు! అలాంటి వాడు ఆత్మజ్ఞానియే కాని 'ఇతరుడు కానేరడు' అని (ఉపదేశసాహస్రి 5లో) చెప్పబడినది.

**స్వేచ్ఛాచారిత్వాభావము**

**221.అస్య జ్ఞానాత్పూర్వం విద్యమానానామేవాహారవిహారాదీనామను వృత్తివచ్ఛుభవాసనానామేవానువృత్తిర్భవతి శుభాశుభయోరౌదాసీన్యం వా**

ఆత్మజ్ఞానికి బ్రహ్మానుభవమునకు ముందే శమదమాది గుణములు ఉండుట చేతను, చెడువాసనలు నశించుటచేతను, సంసారదశయందును ఆహారవిహారాదుల విషయములోను అభిమాన ముండదు. బ్రహ్మాను భవము తరువాత ఆహార విహారాదుల విషయములో ఆసక్తి (కోరికలు) లేని ప్రవృత్తి ఉండును. బ్రహ్మానుభవము తరువాత చెడువాసనలతో ప్రవృత్తి అసలే ఉండదు, కేవలము సద్వాసనలు మాత్రమే ఉండును అథవా మంచి, చెడు రెండువిధములైన వాసనలలోను ఉదాసీనముగా ఉండునని ఈ శ్రుతి :-

**222. తదుక్తం--**

**బుద్ధాద్వైతతత్త్వస్య యథేష్టాచరణం యది ।**
**శునాం తత్త్వదృశాఞ్చైవ కో భేదోఽశుచిభక్షణే ।**
**బ్రహ్మవిత్త్వం తథా ముక్త్వా స ఆత్మజ్ఞో న చేతరః ఇతి చ ।**

'అద్వైత తత్త్వజ్ఞాని కూడ యథేష్టముగా సంచరించినచో, అపవిత్రము నారగించుటలో కుక్కకు, తత్త్వవేత్తకు ఏమిభేదమున్నది ?

(నైష్కర్మ్యసిద్ధి 4-62)
అప్పుడు బ్రహ్మజ్ఞానమును వదలిపెట్టినవాడగును' (ఉపదేశసాహస్రీ 115).

**223. తదానీమమానిత్వాదీని జ్ఞానసాధనాన్యద్వేష్టృత్వాదయః సద్గుణాశ్చాలఙ్కారవదనువర్తన్తే ।**

జీవన్ముక్తదశలో అభిమానరాహిత్యము మొదలగు జ్ఞానసాధనములు ద్వేషించకపోవుట, లోభము లేక పోవుట, ఈర్ష్యలేకపోవుట మొదలగు సద్గుణములు, అలంకారములవలె అతనిని వెంబడించునని నైష్కర్మ్యసిద్ధి (4-69) శ్లోకము.

**224. తదుక్తమ్ --**

**ఉత్పన్నాత్మావబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః ।**
**అయత్నతో భవన్త్యస్య న తు సాధనరూపిణః ఇతి**

'ఆత్మబోధానంతరము ద్వేషరాహిత్యము, నిరాడంబరత, అహింస మొదలగు గుణములు అప్రయత్నముగా అలవడును'.

**ఉపసంహారము**

**225. కిం బహునాయం దేహయాత్రామాత్రార్థమిచ్ఛానిచ్ఛాపరేచ్ఛా ప్రాపితాని సుఖదుఃఖలక్షణాన్యారబ్ధఫలాన్యనుభవన్నన్తఃకరణాభాసాదీనామవభాసకః సంస్తదవసానే ప్రత్యగానన్దపరబ్రహ్మణి ప్రాణే లీనే సత్యజ్ఞాన తత్కార్యసంస్కారాణామపి వినాశాత్పరమకైవల్యమానన్దైకరసమఖిలభేద ప్రతిభాసరహిత మఖణ్డబ్రహ్మావతిష్ఠతే ॥**

• ఇకచెప్పవలసినదేమున్నది? ఈజీవన్ముక్తుడు దేహయాత్రను సాగించుటకై కోరిక (ఇచ్ఛ) కోరిక లేనప్పటికిని (అనిచ్ఛలు) తనకు కోరికలేనప్పటికి ఇతరుల కోరికోనుట (పరేచ్ఛ) చేతను, ఈమూడు విధములైన ప్రారబ్ధ కర్మలనుండి జనించిన, సుఖదుఃఖములను అను భవించుచు, సాక్షి చైతన్యరూపమయిన బుద్ధ్యాదులను ప్రకాశింపజేయుచు

ప్రారబ్ధ కర్మ (ఫలితము) లను అనుభవించిన తరువాత, సచ్చిదానంద రూపమయిన పరబ్రహ్మములో ప్రాణములు కలియగా, అజ్ఞానము, అజ్ఞానకార్యరూపమయిన సంసారము, వీటి నాశమునకు హేతువైన పరమకైవల్యరూపము సచ్చిదానందమయమైన అఖండపూర్ణబ్రహ్మములో ఉంటూ, అనిర్వచనీయమయిన కైవల్యానందమునునుభవించునని శ్రుతి :-

**226. న తస్య ప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవనీయన్తే విముక్తశ్చ విముచ్యత ఇత్యాదిశ్రుతేః ॥**

జీవన్ముక్తుడు శరీరమును త్యజించి, లోకాంతరములకు వెళ్ళడు'. (బృ.ఉ.4-4-6)
ఇక్కడనే సచ్చిదానంద బ్రహ్మములోనే కలియును. (బృ.ఉ.2-2-11)
సమస్త సంసారబంధములను త్రెంచుకొని, ఉత్కృష్టమైన బ్రహ్మానందములో మునుగును' (కఠ.ఉ 5-1)

వేదాంతసారము సమాప్తము

*********

******



# BOOKS OF THE AUTHOR

| | |
|---|---|
| 1. Srauta Prayaschitta Vidhi | 18.00 |
| 2. A Study of Differences Bhatta & Prabhakara Schools of Mimamsa | 52.00 |
| 3. Malavikagnimitram (with English Tr.) | 50.00 |
| 4. Survey of Sanskrit Literature | 40.00 |
| 5. Vedenta Sangraha (with English Tr.) | 40.00 |
| 6. Duta Vakyam (with English Tr.) | 25.00 |
| 7. సంస్కృత సారస్వత సమాలోచనము | 60.00 |
| 8. సర్వదేవతా ప్రతిష్ఠా మందిరము | 40.00 |
| 9. సంస్కృత వ్యాకరణ ప్రథమ పుస్తకము | 25.00 |
| 10. తర్క భాషా (తెలుగు అనువాదముతో) | 25.00 |
| 11. వేదాంతసారము (తెలుగు అనువాదముతో) | 25.00 |

ముద్రణ :
దీప్తి టెక్నికలర్ ప్రింటర్స్,(హైటెక్)
హైదరాబాద్.ఫోన్ : 7671357